## ఉద్దిష్టవృత్తనిర్ణయము.

<table>
<tr><td>∪ ∪ | ∪ ∪ | ∪<br>౧ ౨ ౪ ౮ ౧౬ ౩౨ ౬౪<br>౪<br>౩౨<br>౩౬<br>౧<br>౩౭</td><td>| | ∪ | ∪ |<br>౧ ౨ ౪ ౮ ౧౬ ౩౨<br>౧<br>౨<br>౮<br>౩౨<br>౪౩<br>౧<br>౪౪</td></tr>
</table>

"ఇది యెన్నవఛందమునందుఁ బుట్టినది ? ఆఛందమునం దెన్నవసమవృత్తము?" అని యడిగిన సరిచెప్పెడు విధము. వారు వ్రాసిన గురులఘువులక్రిందను వరుస వెంబడిని ఏకాది ద్విగుణితముగా వ్రాసినలెక్కలలో లఘువులక్రింది లెక్కలన్నియుం వెరసు వేసి వానిక్రింద మఱొకటి పెట్టి కలయఁగూడ ముప్పదియేడాయెను. కనుక అన్నవ సమవృత్తమనునది వారు వైచిన గురులఘువులు లెక్కపెట్టఁగా నేడు ఆయెను. గనుక నేడవఛందమునను బుట్టినది యనునది.

### సప్తమచ్ఛందః ప్రస్తారము.

<table>
<tr><td>∪∪∪∪∪∪∪</td><td>౧</td><td>| | ∪∪ | ∪∪</td><td>౨౦</td></tr>
<tr><td>| ∪∪∪∪∪∪</td><td>౨</td><td>∪∪ | ∪ | ∪∪</td><td>౨౧</td></tr>
<tr><td>∪ | ∪∪∪∪∪</td><td>౩</td><td>| ∪ | ∪ | ∪∪</td><td>౨౨</td></tr>
<tr><td>| | ∪∪∪∪∪</td><td>౪</td><td>∪ | | ∪ | ∪∪</td><td>౨౩</td></tr>
<tr><td>∪∪ | ∪∪∪∪</td><td>౫</td><td>| | | ∪ | ∪∪</td><td>౨౪</td></tr>
<tr><td>| ∪ | ∪∪∪∪</td><td>౬</td><td>∪∪∪ | | ∪∪</td><td>౨౫</td></tr>
<tr><td>∪ | | ∪∪∪∪</td><td>౭</td><td>| ∪∪ | | ∪∪</td><td>౨౬</td></tr>
<tr><td>| | | ∪∪∪∪</td><td>౮</td><td>∪ | ∪ | | ∪∪</td><td>౨౭</td></tr>
<tr><td>∪∪∪ | ∪∪∪</td><td>౯</td><td>| | ∪ | | ∪∪</td><td>౨౮</td></tr>
<tr><td>| ∪∪ | ∪∪∪</td><td>౧౦</td><td>∪∪ | | | ∪∪</td><td>౨౯</td></tr>
<tr><td>∪ | ∪ | ∪∪∪</td><td>౧౧</td><td>| ∪ | | | ∪∪</td><td>౩౦</td></tr>
<tr><td>| | ∪ | ∪∪∪</td><td>౧౨</td><td>∪ | | | | ∪∪</td><td>౩౧</td></tr>
<tr><td>∪∪ | | ∪∪∪</td><td>౧౩</td><td>| | | | | ∪∪</td><td>౩౨</td></tr>
<tr><td>| ∪ | | ∪∪∪</td><td>౧౪</td><td>∪∪∪∪∪ | ∪</td><td>౩౩</td></tr>
<tr><td>∪ | | | ∪∪∪</td><td>౧౫</td><td>| ∪∪∪∪ | ∪</td><td>౩౪</td></tr>
<tr><td>| | | | ∪∪∪</td><td>౧౬</td><td>∪ | ∪∪∪ | ∪</td><td>౩౫</td></tr>
<tr><td>∪∪∪∪ | ∪∪</td><td>౧౭</td><td>| | ∪∪∪ | ∪</td><td>౩౬</td></tr>
<tr><td>| ∪∪∪ | ∪∪</td><td>౧౮</td><td>∪∪ | ∪∪ | ∪</td><td>౩౭</td></tr>
<tr><td>∪ | ∪∪ | ∪∪</td><td>౧౯</td><td></td><td></td></tr>
</table>

## మేరుచక్రోద్ధారము.

నాలవఛందమునకు ఎన్నేసిలఘువుల వృత్తములు ఎన్నెన్ని పుట్టెననఁగా సరి చెప్పెడువిధము. వీథివీథి ఒక్కొక్కఛందము గనుక ఈచక్రమునకు నాలుగడ్డచాళ్లు గాన నాలవఛందము పర్యంతము ఆయెను. దీని నాలుగవబంతి చూచి చెప్పునది. 164




నాలవబంతి మొదలింటి దొకటియుం సర్వగురువృత్తము. రెండవయింటి నాలుగును ఒంటి లఘువృత్తములు. మూఁడవయింటి యాఱును రెండేసి లఘువులవృత్తములు. నాలవయింటి నాలుగును మూఁడేసి లఘువులవృత్తములు కడపలియింటి దొక్కటియుం నాలుగులఘువుల సర్వలఘువులవృత్తము. 165

## శకటచక్రోద్ధారము.

ప్రతిష్ఠాఛందమునందు ఎన్నేసి లఘువులవృత్తములు ఎన్నవ యెన్నవయవి యని యడిగిన సరిచెప్పెడువిధము. 166




ఈ చక్రమునందు మీఁదియింటి దొకటియుం నాలుగు గురువుల సర్వ గురువృత్తము.

రెండవ యడ్డవీథినున్న ౨ వది, ౩ వది, ౫ వది, ౯ వది ఒంటి లఘువృత్తములు. మూఁడవచాలుననున్న ౪ వది, ౭ వది, ౧౩ వది, ౬ వది, ౧౧ వది, ౧౦ వదియు రెండేసి లఘువులవి. నాలుగవబంతినున్న ౮ వది, ౧౫ వది, ౧౪ వది, ౧౨ వది, మూఁడేసిలఘువుల వృత్తములు. కడపటి ౧౬ వది యొక్కటియు నాలుగు లఘువుల సర్వలఘువృత్తము. 167

## పద్యలక్ష్యోపయోగిసంజ్ఞలు.

ఉక్తాఛందం బొక్క యక్షరంబుననుండి యొండొంటికివచ్చు నక్షరంబు షడ్వింశాక్షర పర్యంతంబుగా జరుగు నందు నుక్తకుఁ బ్రతిపాద మేకాక్షరం బౌను. 168

| ఛందస్సంఖ్యలు. | | వృత్తసంఖ్యలు. | ఛందస్సంఖ్యలు. | | వృత్తసంఖ్యలు. |
|---|---|---|---|---|---|
| ౧ | శ్రీవృత్తము | ౧ | ౭ | లోల | ౨౪ |
| ౨ | స్త్రీవృత్తము | ౨ | | హంసమాల | ౨౫ |
| ౩ | నారీవృత్తము | ౩ | | మదరేఖ | ౨౬ |
| | మృగి | ౪ | | కుమారలలిత | ౨౭ |
| | వినయ | ౫ | | సరసిజము | ౨౮ |
| ౪ | కన్య | ౬ | | విభూతి | ౨౯ |
| | వ్రీడ | ౭ | | మధుమతి | ౩౦ |
| | సుకాంతి | ౮ | | మదనవిలసిత | ౩౧ |
| | బింబము | ౯ | ౮ | విద్యున్మాల | ౩౨ |
| ౫ | ప్రీతి | ౧౦ | | వితానము | ౩౩ |
| | ప్రగుణ | ౧౧ | | విమానము | ౩౪ |
| | సతి | ౧౨ | | సింహరేఖ | ౩౫ |
| | పంక్తి (సుందరి) | ౧౩ | | చిత్రపదము | ౩౬ |
| | నంద | ౧౪ | | హంసరుతము | ౩౭ |
| | అంబుజ | ౧౫ | | నారాచము | ౩౮ |
| ౬ | సావిత్రి | ౧౬ | | ప్రమాణి | ౩౯ |
| | విచిత్ర | ౧౭ | | నాగరము | ౪౦ |
| | తనుమధ్య | ౧౮ | | మాణవకము | ౪౧ |
| | చంద్రవదన | ౧౯ | | సమాని | ౪౨ |
| | శశివదన | ౨౦ | ౯ | భుజంగశిశురతము | ౪౩ |
| | సురలత | ౨౧ | | ఉత్సుకము | ౪౪ |
| | వసుధ | ౨౨ | | భద్రకము | ౪౫ |
| | వసుమతి | ౨౩ | | హలముఖి | ౪౬ |
| | | | ౧౦ | పణవము | ౪౭ |

క. యతిగణనామస్తోత్రము, వితతంబుగ నలిపి గురుల వినుతించి తగన్
యతిగణనామయంతంబుగఁ, బతగధ్వజ తేటపఱుతుఁ బద్యవిధంబుల్. 169

క. సమవిషమవృత్తమణులకు, సముద్రము లనంగఁ దనరి షడ్వింశతిభే
దము లై వేదములకుఁ బ్రాదములై ఛందంబు లొప్పిదము లగు వరుసన్. 170

తే. జగతి సమవృత్త మెన్నవఛందమునను
సంభవము నొందు నన్నియక్షరము లమరుఁ
బదపదమునకు హెచ్చును గొదువ లేక
గణములను నొక్కభంగిని గానఁబడును. 171

ఆ. ఒంటికాలఁ గొంద ఱుండఁ జేసిరి పాద, యుంగముతోడఁ గొంద ఱుండఁ జేసి
రేను సకలవృత్తవృషముల నడిపింతు, నాల్గుపాదముల జనంబు వొగడ. 172

క. ఒకకాలను రెండడుగులఁ, బ్రకటంబుగ గ్రంథవిస్తరభయంబునఁ బూ
ర్వకవులవలెఁ జెప్పిన లే,ఖకుఁ డొకలిపి విడువఁ దప్పుఁ గనఁ దర మగునే. 173

క. నేను రచించినవృత్తవి,తానములో నొకట రెంటఁ ద ప్పుండిన వి
ద్యానిధులు కడమపదముల,లో నారసి యతులు గణములును దెలియఁ దగున్. 174

తే. అడుగులకు వర్ణములు గొంచె మగుటఁ జేసి
యందు నుక్తాప్రభృతినవచ్ఛందములను
బొడమ వృత్తములకు నెల్లవడులు లేవు
నాల్గుపదములఁ బ్రాసము ల్నడచుఁ గాని. 175

క. గురులఘుగణసంజ్ఞలయ,క్షరములు దీర్ఘంబు లైనఁ జను నవి రెం డై
పరువడి సంయుక్తము లై, పరఁగిన నవి రెండు నెన్నఁబడు వెంబడి గాన్. 176

I వ. ప్రథమచ్ఛందం బగునుక్తయందుఁ బ్రతిపాదంబునకు నొక్కొక్క యక్షరం బై రెండువృత్తంబులు పుట్టె నందు శ్రీ యనువృత్తము.

శ్రీవృత్తము. ౧-౧

U గ.

శ్రీ
గో
పా
లా

II ద్వితీయచ్ఛందంబగు నత్యుక్తయందుఁ బ్రతి పాదంబునకు రెండేసి యక్షరంబు లై నాల్గు వృత్తంబులు పుట్టె నందు:—

స్త్రీవృత్తము. ౨-౧

UU గగము.

స్త్రీనా
గానీ
జ్ఞానిం
పూనున్.

III తృతీయచ్ఛందం బగుమధ్యయందుఁ బ్రతి పాదంబునకు మూఁడేసియక్షరంబు లై యెనిమిది వృత్తంబులు పుట్టె నందు:—

నారీ. ౩-౧

UUU మగణము.

శ్రీనాథున్
నే నెంతున్
మా నొప్పం
గా నారిన్.

మృగీ. ౩-౩

U I U రగణము.

భూమిలోఁ
రా మహో
ద్దామ మాఁ

అందు వినయవృత్తము. ౩-౪

I I U సగణము.

వినయం
బనఁగాఁ
జను సా
ననఘా.

IV చతుర్థచ్ఛందం బగుప్రతిష్ఠయందుఁ బ్రతి పాదంబునకు నాలుగేసియక్షరంబు లై ౧౬ వృత్తంబులు పుట్టె నందు:—

కన్య. ౪-౧

UUU మ U గ.

భావింప న్మా
గావాప్తి న్గ
న్యావృత్తంబీ
ఠేవన్నొప్పున్.

వ్రీడ. ౪-౨

I UU య U గ.

యగల్ చెప్పం
దగు న్వ్రీడన్
నగోద్ధర్తా
జగద్భర్తా.

సుకాంతి. ౪-౬

I U I జ U గ.

జకారమున్
గకారమున్
సుకాంతికిన్
శుకస్తుతా.

బింబ. ౪-౭

U I I భ U గ.

ఇమ్మహిలోఁ
గ్రమ్ము భగల్
బింబమునం

పంచమచ్ఛందం బగుసుప్రతిష్ఠయందుఁ బ్రతి పాదంబునకు నైదేసియక్షరంబుల ముప్ప దిరెండువృత్తంబులు పుట్టె నందు:—

ప్రీతి. ౫-౩

U I U ర U U గగ.

ప్రీతికి న్రేఫా
స్వీతగద్వంద్వం
బై తగుఁ దైత్యా
రాతివర్ణింపన్.

ప్రగుణ. ౫-౪

I I U స U U గగ.

ప్రగుణాఖ్యం బొ
ప్పగుఁ జెప్పంగా
సగగాసక్తిన్
నిగమస్తుత్యా.

సతి. ౫-౬

I U I జ U U గగము.

క్షితిం జగాసం
గతిం దనర్చున్
సతీసువృత్తం
బతిప్రసిద్ధా.

పఙ్క్తి (సుందరి). ౫-౭

U I I భ U U గగము.

ఏకభకారం
బేకగగంబుల్
గైకొనుఁ బఙ్క్తిన్
శ్రీకమలాక్షా.

నంద. ౫-౧౩

U U I త I U వగణము.

దేవస్తుత నం
దావృత్తమునన్
దేవ న్నెలుపం
గా వచ్చుఁ దనల్.

అంబుజము. ౫-౧౫

U I I భ I Uలగము.

ఇమ్ముల భకా
రమ్ము లగయుం
క్తిం బరఁగుఁ దా
నంబుజమనన్.

వ. షష్ఠచ్ఛందం బగుగాయత్రియందుఁ బ్రతి పాదంబునకు నాఱేసియక్షరంబు లై యఱువదినాల్గువృత్తంబులు పుట్టెనందు:

సావిత్రి. ౬-౧

U U U మ U U U మ.

గోవిందస్తోత్రంబుల్
దైవారు న్మాయుక్తిన్
సావిత్రీవృత్తంబుల్
గావింపంగా నొప్పున్.

విచిత్ర. ౬-౧౦

I U U య I U U య.

తనర్చు న్విచిత్రం
బనంగా యయూక్తిన్
ఘనశ్యామగాత్రా
మునిస్తోత్రపాత్రా.

తనుమధ్య. ౬-౧౩

U U I త I U U యగణము.

కామేపలివాసున్
మే మెంతు మనంగన్
స్వామీ తనుమధ్యన్
భూమిన్ దయ లొప్పున్.

చంద్రవదన. ౬-౧౫

U I I భ I U U య.

చంద్రవదనన్ దే
వేంద్రవినుతా ని
స్తంద్ర తభయంబుల్
సాంద్రముగఁ జెప్పున్.

శశివదన. ౬-౧౬

I I I న I ∪∪ య.

శశివదనాఖ్యన్
విశదము లయ్యెన్
దిశల నయంబుల్
దశముఖవైరీ.

*సురలత. ౬-౧౬

I I I న I ∪∪ య.

మురహరుఁ డేవే
కురుకుచ నాఁగా
ధరణి నయంబుల్
సురలత కొప్పున్.

అందు వసుధావృత్తము.

వసుధ. ౬-౨౮

I I ∪ స I I ∪ స.

వసుదేవసుతున్
బొసఁగింపు మనన్
వసుధాహ్వయ మిం
పెసఁగున్ ససలన్.

వసుమతి. ౬-౨౯

∪∪ I త I I ∪ స.

బృందావనవిహా
రిం దర్శించెద నం
చందు న్వసుమతిం
బొందింతురు తసల్

వ. సప్తమచ్ఛందం బగునుష్ణిక్కునందుఁ బ్రతిపాదంబునకు నేడేసియక్షరంబులై నూట యిరువది యెనిమిది వృత్తములు పుట్టె నందు:—

లోల. ౭-౧౦

I ∪∪ య I ∪∪ య ∪ గ.

ధరిత్రీ సుతారాతిన్
సరోజాతపత్రాక్షున్
హరిన్ యోగలన్ లోలన్
గరం బొప్ప వర్ణింతున్.

హంసమాల. ౭-౨౦

I I ∪ స ∪ I ∪ ర ∪ గ.

సరగంబుల్ రచింపన్
బరఁగున్ హంసమాలా
నరసింహావతారా
సురవిద్విడ్విదారా

మదరేఖ ౭-౨౫

∪∪∪ మ I I ∪ స ∪ గ.

గోపాలాఖ్యుఁడు నిచ్చల్, మాపాలం గలఁ డంచున్
రూపింప న్మసగంబుల్, దీపించు న్మదరేఖన్.

కుమారలలిత ౭-౩౦

I ∪ I జ I I ∪ స ∪ గ.

సుమాయుంధనిభాంగా, రమాహృదయనాథా
కుమారలలితావృత్త మొప్పు జసగాప్తిన్.

---

* 'సురలత' కును, 'శశివదన'కును భేదములేదు. కాఁబట్టి లక్షణమును మరల జూప ననవసరము.

సరసిజము ౭-౩౧

U I I భ I I U స U గ.

శౌరి సరసిజం బిం, పారు భసగయుక్తిన్
నారదనుతిపాత్రా, నీరదనిభగాత్రా.

విభూతి ౭-౪౩

U I U ర I U I జ U గ.

ఇమ్మహీప్రజంబులం, తమ్మునం గకారమున్
గ్రమ్మి యుండునట్టివృ, త్తమ్ము దా విభూతి యా.

మధుమతి ౭-౫౬

I I I న U I I భ U గ.

కుధరవైరికడన్, విధుఁడు దా నమరున్
మధుమతి న్నవమ,న్మథశరీర హరీ.

మదనవిలసితము ౭-౬౪

I I I న I I I న U గ.

పదపడి ననగల్, గదసి వెలసినన్
మదనవిలసితం, బది యదుతిలకా.

వ. అష్టమచ్ఛందం బగుననుష్టుప్పునందుఁ బ్రతిపాదంబునకు నెనిమిదేసియక్షరంబు లై యిన్నూటయేఁబదాఱు వృత్తంబులు పుట్టె నందు:—

విద్యున్మాల ౮-౧

U U U మ U U U మ U U గగము.

శ్రీదేవీధాత్రీప్రాణేశా, యాదిత్యజ్యేష్ఠాదిస్తుత్యా
వేదోద్ధర్తా విద్యున్మాలం, బా దై మాగాప్రాప్తిం బొల్చున్.

వితాన ౮-౬

I U I జ U U U మ U U గగము.

క్షితిజ్ఞ గాయుక్తం బైనన్, వితానవృత్తం బై యొప్పున్
బితామహాద్యాదిత్యప్ర,స్తుతప్రభావా సర్వేశా.

విమానము ౮-౩౮

I U I జ U U I త U U గగము.

క్షమన్ జతాంతస్థగాయు, క్తమై రచింపం బొసంగున్
విమాన మంభోరుహాక్షా, రమాంగనావాసవక్షా.

సింహరేఖ ౯-౮౩

U I U ర I U I జ U U గగము.

ద్వారకాపురీవిహారా, మేరుధీర పంచబాణా
కార సింహరేఖకుం బెం, పారు రేఫజల్ గగంబున్.

చిత్రపదము ౯-౮౫

U I I భ U I I భ U U గగము.

చిత్రపదం బనువృత్తం, బత్రిమునిస్తుత శౌరిన్
స్తోత్రము సేయఁగ నొప్పున్, ధాత్రిని భాగగయుక్తిన్.

హంసరుతము ౯-౮౭

U U U మ I I I న U U గగము.

శ్రీవత్సాంకితసువక్షా, దేవా హంసరుత మెందున్
భావింప న్మనగ గాప్తిన్, గావింపం దగు ధరిత్రిన్.

నారాచము ౯-౯౫

U U I త U I U ర I U వగణము.

క్షీరాబ్ధికన్యకాపతిన్, నారాయణుం ద్రవంబులన్
దోరంబుగా నుతించినన్, నారాచవృత్త మై చనున్.

† ప్రమాణి ౯-౯౬

I U I జ U I U ర I U వగణము.

అమిత్రలోకసంహరా, సమగ్రకాంతి భాసు రా
క్షమన్ జరేభగంబులన్, ప్రమాణివృత్త మొప్పగన్.

నాగరము ౯-౯౭

U I I భ U I U ర I U వగణము.

బా గమరున్ భరేఫసం, యోగలగంబుల న్మహా
యోగినుతు న్వినంబడున్, నాగరనామవృత్త మై.

మాణవకము ౯-౧౦౩

U I I భ U U I త I U వగణము.

శోణమయూఖప్రవిభా, బాణసుపర్వారిహరా
వేణుధరా భత్వములన్, మాణవకం బై తనరున్.

---

† ఇది (పూ. ము.) లో లేదు. దీని పేరుమాత్రము సంజ్ఞలపట్టీలోనున్నది (చ ౯. ౩౯.).

సమాని ౮-౧౦౭

U । U ర । U । జ । U వగణము.

నారదాదిమౌనివరుల్, చేరి శౌరిఁ గొల్తు రనన్
గోరి రేఫముం జవముల్, ధారుణి స్సమాని కగున్.

వ. నవమచ్ఛందం బగుబృహతియందుఁ బ్రతిపాదంబునకుఁ దొమ్మిదేసియక్షరంబు లై యేనూటపండ్రెండు వృత్తంబులు వుట్టె నందు:—

* భుజంగశిశురుతము ౯-౧౭౭

। । । న । । । న । U U యగణము.

నిజమున ననయ లొప్పన్, భుజగశిశురుత మయ్యెన్
సుజనవినుతచరిత్రా, వృజినతృణఘనదాత్రా.

ఉత్సుకము ౯-౧౮౩

U । । భ U । । భ U । U రగణము.

వాసవముఖ్యసురస్తుతా, దాసమనోంబుజషట్పదా
వాసిగ భారము లొందినన్, భాసిలు నుత్సుకవృత్తముల్.

భద్రకము ౯-౧౮౭

U । U ర । । । న U । U రగణము.

కాద్రవేయశయనా సము, న్నిద్రదైత్యమదభంజనా
రుద్రమిత్ర రనరేఫముల్, భద్రకంబునకు భాసిలున్.

హాలముఖి ౯-౨౪౧

U । U ర । । । న । । U సగణము.

కింకరీకృతసురవరా, పంకజాతదళనయనా
శంక మా రనసగణముల్, శంక లేక హాలముఖికిన్.

ఆ. పఙ్క్తినుంచి వృత్తపఙ్క్తి కిన్నవర్ణాయి, వడి యటంచుఁ జెప్పఁబడియె నిచట
సంస్కృతంబునందుఁ జనుఁ బదవిచ్ఛేద, మడుగు మొదలివర్ణమగుఁ దెనుఁగున. 177

క. ధర గణితశాస్త్రసంజ్ఞల, శరరసగిరివంటినిధిని శాశంకరభా
స్కరవిశ్వమనుదినోర్వీ, శ్వరనామములు యతివర్ణసంఖ్యార్థంబుల్. 178

వ. దశమచ్ఛందం బగుపఙ్క్తియందుఁ బ్రతిపాదంబునకుఁ బదేసియక్షరంబు లై వేయు నిరువదినాల్గువృత్తములు వుట్టె నందు:— 1024

---

*సంజ్ఞలపట్టీలో 'భుజంగశిశు' అనియే యున్నది; గాని ఇచ్చట (పూ. ము) లో 'భుజంగశశి' అని తప్పుగనున్నది.

పణవము ౧౦-౧౨౧

UUU మ III న IUU య U గ.

ఉర్వి న్మన్యగ ♦ యంతపాదంబుల్, పర్వ న్షడ్యతిఁ ♦ బణవం బయ్యెన్
గీర్వాణాహిత ♦ గిరినాకేశా, సర్వేశా రవి ♦ శతసంకాశా.

మయూరసారి (మయూరభాషిణి) ౧౦-౧౭౧

UIU ర IUI జ UIU ర U గ.

వెక్కసించె శైల ♦ విశ్రమంబు, లొప్పి రేఫజంబు•లు స్రగంబుల్
చక్కఁగా మయూర•సారి కొప్పున్, నిక్క మంబుజాత•నేత్ర శౌరీ.

రసాలి ౧౦-౧౮౭

UIU ర III న UIU ర U గ.

గోత్రవిశ్రమము ♦ గూడి భక్తిన్, ధాత్రి రేఫనగ•ణాంబు లొప్పెఁ
బోత్రిరూప రగ•ము ల్రసాలం, జిత్రభంగి నుతి•సేయు నిన్నున్.

రుగ్మవతి ౧౦-౧౯౯

UII భ UUU మ IIU స U గ.

అంగయతిం బొం•దై భమస ల్వ,ర్వుం గురుయుక్తి ♦ న్రుగ్మవతి న్స
త్యాంగనకై తేఁ•డా సురశాఖిం, బొంగుచు గోపీ•పుత్రుఁ డనంగన్.

*చంపకమాలి ౧౦-౧౯౯

UII భ UUU మ IIU స U గ.

భూమిధరశ్రాంతు ♦ ల్పొలుపారన్, బ్రేమ భమంబు ల్గో•రి సగంబుల్
దాము నుతించు న్నం•దసుతు న్భా, మామకరాంకుం జం•పకమాలిన్.

మణిరంగము ౧౦-౨౧౯

UIU ర IIU స IIU స U గ.

అంగనామణి ♦ లంగయతుల్గా, సంగ మెచ్చ ర•సాగురుయుక్తిన్
బొంగుచు న్యదు•పుంగవు వేఁడన్, రంగగున్ మణి•రంగ మనంగాన్.

మత్త (హంసశ్రేణి) ౧౦-౨౭౧

UUU మ UII భ IIU స U గ.

శైలశ్రాంతి న్మభ•సగ లోలిం, గ్రాల న్మత్తాఖ్యను ♦ గనుపట్టున్
బాలించె న్యాదవ•పతి యాపాం,చాలిం గౌరవ్యుల•సభ నాఁగన్.

*రుగ్మవతికిని, చంపకమాలికిని గణములలో భేదములేదు; యతిస్థానమున మాత్రము భేదముగలదు గాన వేఱుగఁజెప్పఁబడినది.

### కౌముది ౧౦-౨౯౬

I I I న U U I త U U I త U గ.

మునిసుతా కౌముదీవృత్తమొ, ప్పును నతాగంబులన్ షడ్యతిన్
దునిమెఁ బౌలస్త్య భూపుత్రికై, కినుక రామక్షితీశుం డనన్.

### భోగివిలసితము (విలసితము) ౧౦-౩౫౧

U I I భ I I U స I U I జ U గ.

సాగభసములున్ జగంబులున్, జా గగు నగవిశ్రమంబులన్
భోగివిలసితంబుఁ జెప్పఁగా, సాగరతనయా సమన్వితా.

### మనోరమ ౧౦-౩౪౪

I I I న U I U ర I U I జ U గ.

నరజగంబుల న్మనోరమల్, సరవి శైలవిశ్రమంబులన్
దురితదూరు సింధుజాపతిన్, సొరిది సన్నుతించు నెంతయున్.

### *శుద్ధవిరాటి ౧౦-౩౪౫

U U U మ I I U స I U I జ U గ.

చా లొప్ప న్మసజ ల్గకారమున్, వ్రాలు న్శుద్ధవిరాటిన్ షడ్యతిన్
నీలాంగా రమణీమనోభవా, నాళీకాసన నందనస్తుతా.

### నందిని ౧౦-౩౫౯

U I I భ U U I త I U I జ U గ.

శ్రీరమణా నిర్జితదానవా, సారసపత్రేక్షణ షడ్యతిన్
సారె భతంబుల్జగము ల్దగన్, ధీరులచే నందిని నాఁ జనున్.

### పఙ్క్తి ౧౦-౪౩౯

U I I భ U I I భ U I I భ U గ.

గ్రావవిరామముగా విబుధుల్, భావజుతండ్రి నిభాభగురుల్
గా వినుతించినఁ గావ్యముల, న్వావిరిఁ బఙ్క్తియనం బరఁగున్.

వ. ఏకాదశచ్ఛందం బగుత్రిష్టుప్పునందుఁ బ్రతిపాదంబునకుం బదునొకండేసియక్షరంబులై ౨౦౪౮ వృత్తంబులు పుట్టె నందు:—

* (పూ. ము.) సంజ్ఞలపట్టిలోఁ 'వరాటి' అనియున్నది; (పె) లో విరాటి; విరాట (ప).

ఇంద్రవజ్ర ౧౧-౩౫౬

∪∪ । త ∪∪ । త । ∪ । జ ∪∪ గగము.

ఇంతు లన్దా పాదుదు • రింద్రవజ్రల్, స్వాంతంబున న్మోహము • సంధిలంగన్
దంతావళశ్రాంతిని•తా జకార, ప్రాంతంబునం గద్వయ • మంద మందన్.

ఉపేంద్రవజ్ర ౧౧-౩౫౫

। ∪ । జ ∪∪ । త । ∪ । జ ∪∪ గగము.

క్షపాచరారు ల్జత•జ ల్గగంబుగ్, బ్రపూర్ణ మై దంతివి•రామ మొప్పన్
ద్విపాధిపత్రాత నుతింపఁ బేర్రై, యుపేంద్రవజ్ర ల్వెల•యు న్ధరిత్రిన్.

ఉపస్థితము ౧౧-౩౬౫

∪∪ । త । ∪ । జ । ∪ । జ ∪∪ గగము.

భక్తు ల్హరిమీఁద ను•పస్థితం బా, స్క్తి న్విరతు ల్కాఁగి • సంఖ్య సాగన్
సూక్తు ల్గాని చెప్పెడు•చోఁ దజాగా, యుక్తం బగుచుం జెలు•వొందుచుండున్.

దోదకము ౧౧-౪౩౯

∪ । । భ ∪ । । భ ∪ । । భ ∪∪ గగము.

తోరపువేడుక • [1]దోదక మొప్పన్, భూరివిరామము • భూధరసంజ్ఞం
బారుచు భాభగ•గాన్విత మై ల,క్ష్మీరమణా విర•చింప నెసంగున్.

రథోద్ధతము (పరాంతిక) ౧౧-౬౯౯

∪ । ∪ ర । । । న ∪ । ∪ ర । ∪ వగము.

అంది రేఫనర•వాప్తి నొప్ప గో,విందభూమిధర•విశ్రమంబులన్
జెంది కబ్బములఁ • జిత్రభంగిఁ జె,న్నొందు నెంతయు ర•థోద్ధతం బిలన్.

భద్రకము ౧౧-౭౦౪

। । । న । । । న ∪ । ∪ ర । ∪ వగము.

నరకదమన • నారవంబులన్, సరగఁ గుధర • సమ్మితంబు లై
విరతు లమర • వేడ్కఁ జెప్పినం, బరఁగుఁ గృతుల • భద్రకం బనన్.[2]

స్వాగతము ౧౧-౪౪౩

∪ । ∪ ర । । । న ∪ । । భ ∪∪ గగము.

స్వాగతంబు దగు • శైలవిరామం, బైగజేంద్రవర•దా రనభంబుల్
పై గురుద్వయము • భాసిలఁ జెప్పన్, యోగిమానసప•యోజమిళిందా.

---

1 తోటక (పె. ప). 2 చూ. చంద్రిక.

## కాంతి ౧౧-౮౭౭

UU । త । U । జ । U । జ । U లగము.

క్రాంతు లక్కరిసంఖ్యను ♦ రాజిలఁగా, సంతోషముతోడఁ ద♦జాలగముల్
చింతింపఁ బదంబులఁ ♦ జెంద రమా, కాంతాహృదయేశ్వర ♦ కాంతి యగున్.

## శ్యేని ౧౧-౬౮3

U । U ర । U । జ U । U ర । U వగణము.

మానితాద్రివిశ్ర♦మంబుఁ బూనఁగా, శ్యేనికి న్రజ ల్వ♦యి న్రవంబులున్
గాని యొండు గూర్పఁ ♦ గాదు రుక్మిణీ,ప్రాణనాథ కామె♦పల్లిమందిరా.

## వాతోర్మి ౧౧-౮౧౬

UUU మ U । । భ UU । త । U వగణము.

ఆమోదం బొప్పఁగ ♦ వ్యాసాదికవుల్, భూమిధ్రక్రాంతులు ♦ పొంగార మహీ
భామాప్రాణేశ మ♦భంబుల్ తవలున్, దా మీవాతోర్మిని ♦ దాపింతు రొగిన్.

## కలితాంతము (గీతాలంబనము) ౧౧-౮౭౭

U U । త । U । జ । U । జ । U లగము.

సామోద్భవవిశ్రమ♦సంయుత మై, వేమాఱు తజాలగ♦విస్తృత మై
దామోదరదేవుక♦థ ల్పలుకన్, భూమిం గలితాంతము ♦ పూర్ణ మగున్.

## శాలిని ౧౧-౨౮౯

U U U మ U U । త U U । త U U గగము.

ధీరశ్రేష్ఠు ల్సన్ను♦తింపం గవీంద్రా,ధారం బై ధాత్రి న్మ♦తాగాగణాప్తిన్
దోరం బై భూభృద్య♦తుల్ సంఘటింపన్, నీరేజాక్షా శాలి♦నీవృత్త మొప్పున్.

## సుముఖి ౧౧-౮౮౦

। । । న । U । జ । U । జ । U లగము.

ఖగపతివాహ ♦ కపర్దినుతా, మృగపతిమధ్య ♦ హితార్తిహరా
నగవిరమం బె♦నయంగ నజా, లగములచేఁ జె♦లఁగు న్సుముఖుల్.

## భ్రమరవిలసితము ౧౧-౧౦౦౯

U U U మ U । । భ । । । న । U వగణము.

ఏయంఘ్రిం బార♦యి మగణభన, ల్వాయొక్కం డవ్వ♦లను నెలకొనన్
మాయాతీతా భ్ర♦మరవిలసితం, బై యొప్పం దర్క♦యతుల నిలుచున్.

వృత్త ౧౧-౨౮౮

| | | న | | U స U U | త U U గగము.

అ నయమును వే॥దాంగంబు నెప్పన్, దనుజహార న॥స్తంబు ల్లగంబున్
బెనఁగొని ధరా॥భృద్విశ్రమంబుల్, దనరునది వృ॥త్తావృత్త మంచున్.

పథ్వి ౧౧-౮౯౬

| | | న | | | న | U | జ | U వగము.

నలినభవనుత॥నాజలగం, బులు గలయతులఁ ॥ బొందుపడం
బెలుచఁ బలికినఁ॥బృథ్వి యనన్, వెలయు నొకసమ॥వృత్త మిలన్.

వృంత ౧౧-౨౫౬

| | | న | | | న | | U స U U గగము.

నగణయుగము సగ॥ణం బొందున్, గగ మొకటియు జత॥గాఁ గూడన్
ఖగవిరమములను ॥ గల్పింపన్, దగుఁ గవులకు వసు॥ధ న్వృంతల్.

మౌక్తికమాల ౧౧-౪౮౭

U | | భ U U | త | | | న U U గగము.

భక్తజనత్రాత ॥ భతనగాసం, యుక్తము లై మాని॥యుంతయతుల్ సు
వ్యక్తము లై సూక్తు॥లమరఁ జెప్పన్, మౌక్తికమాలాక్ర॥మము లెసంగున్.

ఉపస్థితము (శిఖండివిరుతము); (స్త్రీ) ౧౧-౨౮౬

| U | జ | | U స U U | త U U గగము.

ఉపస్థితమునం ॥ దొప్పారుచుండున్, దపస్వివిరతు ॥ ల్దాకం జకారం
బుపై సతగణం॥బు ల్గద్వయంబున్, గపిధ్వజసఖా ॥ కామేపలీశా.

ఏకరూప ౧౧-౩౯౬

U U U మ U | | భ | U | జ U U గగము.

ఏపారుం గావ్యముల ॥ నేకరూపల్, క్ష్మాపుత్రీశున్ మభజ॥గాగణంబుల్
బ్రాపించుం గుజరవి॥రామ మొప్పన్,బాపంబుల్ వాయుఁటకుఁ॥బ్రస్తుతింపన్.

చంద్రిక ౧౧-౭౦౪

| | | న | | | న U | U ర | U వగము.

అగవరధర నార॥వాన్వితం,బుగఁ గృతులను జెప్పఁ ॥ బొందికై
తగ నిధివిరమంబు ॥ దాఁకఁగా, జగతిని నెగ డొందుఁ ॥ జంద్రికల్.

వ. ద్వాదశచ్ఛందం బగుజగతియందుఁ బ్రతిపాదంబునకుఁ బంద్రెండేసియక్షరంబు లై ౪౦౯౬ వృత్తంబులు పుట్టె నందు.

స్రగ్విణి ౧౨-౧౧౭౧

U I U ర U I U ర U I U ర U I U ర.

కామెపల్లీ మహా॰గ్రామమధ్యంబునన్
భూమిదేవోత్తము ॰ ల్బ్వాజ సేయంగ నా
స్వామియున్నాఁడనన్ ॰ స్రగ్విణిన్ శైలవి
శ్రామయుక్తిం జతు॰ష్కంబగున్ రేఫముల్.

భుజంగప్రయాతము ౧౨-౫౮౬

I U U య I U U య I U U య I U U య.

భజింతున్ సదా కామె॰పల్లీనివాసున్
వ్రజస్త్రీవిటున్ యాద॰వశ్రేష్ఠు నంచున్
భుజంగప్రయాతాఖ్య॰ము ల్నాల్గు యాలన్
గజవ్రాతవిశ్రాంతి॰గాఁ జెప్ప నొప్పున్.

తోటకము ౧౨-౧౭౫౬

I I U స I I U స I I U స I I U స.

తగుఁ దోటకవృత్తము ॰ ధాతృయతిన్, సగణంబులు నాలుగు ॰ సాగినఁ బ
న్నగపుణ్యనదీసుర॰నాథదిశా, జగతీద్విజపట్టణ॰సంచరణా.

జలధరమాల ౧౨-౨౪౧

U U U మ U I I భ I I U స U U U మ.

ధీరుల్ మెచ్చం గృతుల న॰తిశ్రీదం బై, మారాకారా జలధర॰మాలావృత్తం
బై రాజిల్లున్ భువిఁ జతు॰రాస్యశ్రాంతుల్, సారం జేరన్ మభసమ॰సంయుక్తంబై.

వంశస్థము ౧౨-౧౩౮౨

I U I జ U U I త I U I జ U I U ర.

జతల్ జరేఫంబులు ॰ సామజాతస, మ్మితాక్షరశ్రాంతుల ॰ మెప్పు పుట్టఁగాఁ
బతంగరాజధ్వజుఁ ॰ బద్మలోచనున్, నుతింప వంశస్థ మ॰నూనమై చనున్.

ఇంద్రవంశము ౧౨-౧౩౮౧

U U I త U U I త I U I జ U I U ర.

ఇందీవరాక్షుల్ తగ ॰ నింద్రవంశ మా, నందంబునం బాడిరి ॰ నందసూతిపై
డెందంబుల న్మోహము॰తేవ మీఱఁగాఁ, బొందైగజశ్రాంతులు ॰ పూనఁద్రాఁజ్రలన్.

ద్రుతవిలంబితము ౧౨-౧౮౬౪

। । । న ∪ । । భ ∪ । । భ ∪ । ∪ ర.

ద్రుతవిలంబిత•రూప మగుం గుభృ, ద్యతి నభారయు•తంబుగఁ జెప్పినన్
నతజనార్తివ•నశ్వసనప్రియా, వితతభూసుర•వీరపురాలయా.

తోదకము (తామరసము) ౧౨-౧౭౬౦.

। । । న । ∪ । జ । ∪ । జ । ∪∪ య.

సలలితతోదక•సామజవిశ్రాం, తులను నజాయలఁ • దోదకవృత్తం
బలవడుఁ గేశవ•రాసురకాష్ఠో, జ్జ్వలనవకోశర•సాష్ఠలవాసా.

ప్రియంవద ౧౨-౧౮౦౦

। । । న ∪ । । భ । ∪ । జ ∪ । ∪ ర.

విభు శమీరపృథి•వీజరక్షభా, గభవనాలయునిఁ గామెపల్లికా
ప్రభు నభజ్రలను • బ్రస్తుతింప నౌ, నిభవిరామమున • నీప్రియంవదల్.

ప్రమితాక్షరము ౧౨-౧౭౭౨

। । ∪ స । ∪ । జ । । ∪ స । । ∪ స.

ప్రమితాక్షరం • బమరు బద్మజవి, శ్రమ మొప్పుమీఱ • సజసాయుతమై
యమునానదీతటవి•హార పృథా, ప్రమదాకుమారసఖ • భద్రయశా.[1]

జలోద్ధతగతి ౧౨-౧౭౬౬

। ∪ । జ । । ∪ స । ∪ । జ । । ∪ స.

జలోద్ధతగతిం ది•శాగజయతిన్, మెలంగు నినుమూఱు • మెచ్చుగ జసల్
ఫలానుభవ కామె•పల్లినిలయా, ఖరాంబుదసమీర • కామజనకా.

విశ్వదేవి ౧౨-౫౨౨

∪∪∪ మ ∪∪∪ మ । ∪∪ య । ∪∪ య.

శ్రీవత్సాంకా పద్మాధ•శ్రీకళత్రా, దేవేంద్రస్తోత్రా విశ్వ•దేవీసమాఖ్యం[జెప్పన్.
బై విప్పొందు న్మాయాగ•ణావాప్తి దిక్సం, ఖ్యావిశ్రామంబుల్ చోద్య•మైయుండఁ

చంద్రవర్త్మ ౧౨-౧౯౭౯

∪ । ∪ ర । । । న ∪ । । భ । । ∪ స.

ఇంద్రవంద్య జగ•దీశ ఘనయశ, స్సాంద్ర కామెపలి•సద్మ యదువరా
చంద్రవర్త్మ యగు • శైలవిరతి ని, స్తంద్ర మై రనభ•సంబు లమరినన్.

---

1 (ప. పె) లో ౧౭౭౨ అనియే ఉన్నది. (పూ. ము)లో ౧౭౮౦ ఉన్నది
ఇదిచూచి యిటీవలివారు వ్రాతప్రతులలో సరిగానున్న సంఖ్యను తప్పుగాదిద్దుకొన్నారు

### ప్రహేయము. ౧౨-౫౭౬

I I I న I I I న ∪ ∪ ∪ మ I ∪ ∪ య.

కరివిరమణముల్ • గా నామయంబుల్, బరఁగ నిలుపఁ జూ•పట్టుం బ్రహేయం
బురగశయన భో•జోర్వీశపుత్రీ, వరపరమకృపా•వారాశి కృష్ణా.

### ప్రముదితవదన ౧౨-౧౨౧౬

I I I న I I I న ∪ I ∪ ర ∪ I ∪ ర.

మమత నిభవిరా•మముల్ గూడఁగా, జమిలినరములన్ • సదా చెన్నగున్
బ్రముదితవదనల్ • రమానాయకా, సుమశరజనకా • సుపర్వస్తుతా.

### కుసుమవిచిత్రము ౧౨-౯౭౬

I I I న I ∪ ∪ య I I I న I ∪ ∪ య.

కుతలములోనం • గుసుమవిచిత్రం, బతిశుభదం బై • యగయతు లన్నం
దతనయ యొప్పున్ • నయ లినుమా ళ్లై, సతతము విద్వ•జ్జనులు నుతింపన్.

### మణిమాల ౧౨-౭౮౧

∪ ∪ I త I ∪ ∪ య ∪ ∪ I త I ∪ ∪ య.

శామేపలినామ•గ్రామస్థలవాసా, స్వామీ తయకార•ద్వంద్వంబు పొసంగున్
వేమాఖ్యమహీభృ•ద్విశ్రాంతులతోడన్, భూమండలిఁగూర్పం•బొల్చున్మణిమాలల్.

### మేఘవిలసితము ౧౨-౨౦౮౧

∪ ∪ ∪ మ I I I న I I I న I I ∪ స.

కాళిందీముఖ•కమలమధుకరా, నాళీకాసన•నతరసవిరతు
ల్గ్రాలన్మేఘవి•లసితము దనరు, న్వాలాయంబు మ•ననసగణములన్.

వ. త్రయోదశచ్ఛందం బగునతిజగతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదుమూఁడేసియక్షరంబు లై యెనిమిదివేలనూటతొంబదిరెండువృత్తములు పుట్టె నందు:—

### మత్తమయూరము ౧౩-౧౬౩౩

∪ ∪ ∪ మ ∪ ∪ I త I ∪ ∪ య I I ∪ స ∪ గ.

శ్రీగోపాలా తంగెడ•సీమావనిగేహా
వాగీశాదిస్వర్గని•వాసస్తుతిపాత్రా
యోగిధ్యేయామత్తమ•యూరంబున గొప్పున్
నాగక్రాంతు ల్మత్యగ•ణంబు ల్సగమొందన్.

ప్రహర్షిణి ౧౩-౧౪౦౧

U U U మ | | | న | U | జ U | U ర U గ.

ధీరుల్ సింధురవిర♦తిన్ మనప్రగంబుల్, సారెంబాదములను♦సంఘటించుచుండన్
గ్రూరారిప్రహరున♦కుం బ్రహర్షణుల్పెం, పారంజెప్పుదురుమ♦హాముదంబుతోడన్.

ప్రభాతము ౧౩-౧౩౯౨

| | | న | U | జ | U | జ U | U ర U గ.

మొనసి నజారగ♦ముల్ ప్రభాతవృత్తం, బునకు మదేభస♦మూహవిశ్రమంబుల్
దనరఁగ నిల్పుఁ బృ♦దాకురాజతల్పా, కనకమయాంశుక ♦ కామెపల్లివాసా.

జలదము ౧౩-౩౫౪౩

U | | భ U | U ర | | | న U | | భ U గ.

బంగరుచుంగుపచ్చడము ♦ పైఁ గలయా, తంగెడదేశవాసు జల♦దంబులచే
తంగడు సన్నుతింతు నవ♦తారయతిన్, బొంగుచు సారె భర్నభగ♦ముల్ గదియన్

మంజుభాషిణి ౧౩-౨౭౯౬

| | U స | U | జ | | U స | U | జ U గ.

ఉరగాపగాదిహరి♦దుర్వారాలయా, కరుణాసముద్ర ముర♦గర్వభంజనా
యిర వొందుచుండు సజ♦లిబ్బడింపఁ బల్మరు గాప్తిధాతృయతి♦మంజుభాషిణుల్.

రుచిరము ౧౩-౨౮౦౬

| U | జ U | | భ | | U స | U | జ U గ.

గదాధరున్ జభసజ♦గంబులన్ గవుల్, సదా పితామహయతి♦సొగుచుండఁ గా
ముదంబుతోడ రుచిర♦ము ల్రచింతు రి, ట్లుదారభక్తిఁ గృతుల ♦ నుర్వరాస్థలిన్.

క్షమ (క్షప) ౧౩-౨౩౬౮

| | | న | | | న U U | త U U | త U గ.

క్రమమున నిభవి♦శ్రాంతి నాతాగయుం, క్షముగ సుకవిప♦ద్యంబు లూహించినన్
క్షమ ననఁ బరఁగుం ♦ గంజపత్రేక్షణా, సుమశరజనకా ♦ శూరవంశోత్తమా.

చంచరీకావళి ౧౩-౧౧౫౩

U U U మ U U U మ U | U ర U | U ర U గ.

కంబుగ్రీవాసత్యా♦కామినీప్రాణనాథా, బింబోష్ఠామారాగ♦ల్పేర్చిభూభృద్యతుల్గా
ఛుంబాదంబైధాత్రిం♦జంచరీకావళీనా, మంబొందుంగావ్యశ్రీ♦మానినీభూషణంబై.

### మత్తహంసిని ౧౩-౨౮౯౦

। ∪ । జ ∪ ∪ । త । । ∪ స । ∪ । జ ∪ గ.

మనోహరాకార ♦ మధుదైత్యసంహరా, వినాయకారూఢ ♦ విబుధేంద్రవందితా
జనార్దనా జత్స♦జగురుల్ శుభ్రద్యతిన్, దనర్చుంబద్యంబు♦దగు మత్తహంసినిన్.

### సుమంగలి ౧౩-౧౭౭౨

। । ∪ స । ∪ । జ । । ∪ స । । ∪ స ∪ గ.

సొరిదిన్ ధరిత్రిని ♦ సుమంగలివృత్తం, బరయంగ సామజ ♦ యతిన్ సజసాగల్
తిర మొంద నొప్పు వి♦ధిపూజితపాదాం, బురుహద్వయూ ఖర♦మురాసురవైరీ.

వ. చతుర్దశచ్ఛందం బగుశక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునాలుగేసియక్షరంబులై ౧౬౩౮౪ వృత్తములు పుట్టె నందు:—

### వనమయూరము ౧౪-౩౮౭౩

∪ । । భ । ∪ । జ । । ∪ స । । । న ∪ ∪ గగము.

శ్రీకర ధరాధర♦జిష్ణునుత పుణ్య, శ్లోక భజసన్నగగ♦లుక్ ద్రుహిణసంఖ్యన్
సోఁకుఁవిరమంబుగను♦చున్వనమయూరా,ఖ్యాకమనువృత్తమిల♦నుత్తమిలుచుండున్.

### వసంతతిలక (సింహోన్నతము, ఉద్ధర్షిణి, శోభావతి, మధుమాధవి) ౧౪-౨౯౩౩

∪ ∪ । త ∪ । । భ । ∪ । జ । ∪ । జ ∪ ∪ గగము.

శ్రీమేదినీరమణ♦సింధుతరంగరంగ, ద్రామాహితల్ప విన♦తాసుతవాహ రాధా
కామా వసంతతిల♦కన్ దభజాగగంబుల్,సామప్రభూతయతి ♦ సాగిధరం జెలంగన్.

### భూనుతము ౧౪-౩౫౧౫

। ∪ । ర । । । న ∪ । । భ ∪ । । భ ∪ ∪ గగము.

ముష్కరించి రనభాగగ♦ముల్ దశవిశ్రా, మంబుభూతలమునందుస♦మానితమయ్యెన్
జాంబవత్యధిప కేశవ♦సారసనేత్రా,కంబునందకగదాధర♦ఖండితసాళ్వా.

### సుందరి ౧౪-౫౭౧౫

∪ । । భ ∪ । । భ ∪ । ∪ ర । । ∪ స । ∪ వగణము.

సూరిజనప్రకరంబు ♦ సుందరి నెన్నఁగా
భారసవంబులు రత్న ♦ భాసితవిశ్రమా
ధారముగాఁ దనరారుఁ ♦ దార్క్ష్యతురంగమా
శౌరి ముకుందమునీంద్ర ♦ సన్నుతకేశవా.

ప్రహారణకలిత ౧౪-౮౧౨౮

। । । న । । । న ∪ । । భ । । । న । ∪ వగణము.

పనిగొను నెపుడుం•బ్రహారణకలితన్, ననభనవలు మం • దగజవిరమముగ్
ఘననిభఘనవి•గ్రహ బకమురమ, ర్దన మధునరక • ప్రహారణకలితా.

నవనందిని ౧౪-౩౮౨౦

। । ∪ స । ∪ । జ । । ∪ స । । । న ∪ ∪ గగము.

నవనందినిన్ సజగణ•స్నగగ లాయెన్, నవవిశ్రమంబును ద•నర్చి చెలువొప్పన్
నవనీతచోరకు జ•నార్దనునుపేంద్రున్, భవదూరు నెంతురు స•భాసదులుభక్తిన్.

అపరాజితము ౧౪-౫౮౨౪

। । । న । । । న ∪ । ∪ ర । । ∪ స । ∪ వగణము.

ననరసలగ లొందిన న్నవవిశ్రమం, బును గలిగి కవీంద్ర•భూషిత మై జనా
ర్దన నిగమసుగోచ•రా యపరాజితం, బనఁగఁ దనరు శ్రావ్య•మై వినువారికిన్.

అసంబాధ ౧౪-౨౦౧౭

∪ ∪ ∪ మ ∪ ∪ । త । । । న । । ∪ స ∪ ∪ గగము.

వాలాయంబున్ సత్కవిజనములు • వాక్రువ్వన్
వాలారున్ గోవింద వరద ధ్రువ•వాత్సల్యా
కాళిందీప్రాణేశ మతనసగ•గప్రాప్తిన్
జాలాభాస్వద్విశ్రమమునను న•సంబాధల్.

కమలవిలసితము ౧౪-౪౦౯౬

। । । న । । । న । । । న । । । న ∪ ∪ గగము.

క్రమమున నననన•గగములు గూడన్, గమలవిలసితము • కమలజవిశ్రా
మము జగతిని నగు•మహితచరిత్రా, కమలదళనయన • కడుఁ బొగడొందున్.

XV వ. పంచదశచ్ఛందం బగునతిశక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదిహేనేసి యక్షరంబు
లై ౩౨౭౬౮ వృత్తంబులు పుట్టె నందు.

మాలిని ౧౫-౪౬౭౨

। । । న । । । న ∪ ∪ ∪ మ । ∪ ∪ య । ∪ ∪ య.

కనకకశిపుహర్తన్ • గానలోలున్ శుభాంగున్
దనుజహరణదక్షున్ • ధర్మమార్గానుసారిన్
మనసిజగురు నెంతున్ • మాలినీవృత్త మందున్
ననమయయగణంబుల్ • నందివిశ్రాంతి గూడన్.

సుకేసరము (భద్రకము) ౧౫-౧౧౧౮౪

I I I న I U I జ U I I భ I U I జ U I U ర.

సురుచిరధర్మమూల మయి♦సొంపు మీఱు నా, గిరిధర నాభిపంకజసు♦కేసరంబువై
ఖరి నజభజ్రము ల్గదియఁ♦గల్పనంబునన్, గిరిశవిరామసంగతి సు♦కేసరంబునన్.

మనోజ్ఞ ౧౫-౧౧౬౩౨

I I I న I U I జ I U I జ U I I భ U I U ర.

అజమృడవాసవసంత♦తార్చితపాదపం
కజయుగళున్ హరి నిర్వి♦కారు మనోజ్ఞ నా
ఋజు వగువృత్తమునందుఁ ♦ బ్రీతి నుతింపఁగా
నజజభరంబులు వొల్చు ♦ నచ్చిన దిగ్యతిన్.

మణిభూషణము ౧౫-౧౧౭౦౭

U I U ర I I I న U I I భ U I I భ U I U ర.

వింత యైనమణిభూషణ♦వృత్తమునందు న
త్యంతమోదమున నెన్నను ♦ నద్దశవిశ్రమా
క్రాంత మయ్యు రనభారలఁ ♦ గంజదళాక్షుఁ గం
సాంతకు న్నరకసంహరు ♦ నార్యసమూహముల్.

సుగంధి(*శాలినీ, చామర, ప్రశాంతి) ౧౫-౧౦౯౨౩

U I U ర I U I జ U I U ర I U I జ U I U ర.

రంబు జంబు రంబు జంబు ♦ రంబు చెన్నుమీఱఁగాఁ
దొమ్మిదింట విశ్రమంబు ♦ తోర మై సుగంధికిన్
గ్రమ్మఁగా నుతింప నొప్పుఁ ♦ గానలోలుఁ డచ్యుతుం
డంబుజాక్షుఁ డాదిదేవుఁ ♦ డక్షరాఖ్యుఁ డెప్పుడున్.

ఇల ౧౫-౧౬౩౬౪

I I U స I U I జ I I I న I I I న I I U స.

గజవిశ్రమంబునఁ ♦ గనలు నిల యనఁగా, సజనాస లుండిన♦సకలకవికృత మై
భుజగాశనధ్వజు♦భుజగపతిశయనున్, వ్రజసుందరీముఖ♦వనజహితుఁ బొగడన్.

* ౧౧-వ ఛందములో మఱియొకశాలినీవృత్తము గలదు. (229 పుట).

## చంద్రరేఖ ౧౫-౪౬౨౫

UUU మ U I U ర UUU మ I UU య I UU య.

మత్తేభశ్రాంతిచే ర•మ్యం బౌ మహిం జంద్రరేఖా
వృత్తం బౌ మ్రమ్యయంబుల్ • వేదర్కుఁ హృషీకేశుఁ బార్థ
క్షత్త న్నారాయణు న్వి•శ్వామిత్రయాగారిదైత్య
చ్ఛేత్త న్దాశార్హు లక్ష్మీ•చిత్తాబ్జవాసు న్నుతింపన్.

## నలిని ౧౫-౧౪౦౪౪

I I U స I I U స I I U స I I U స I I U స.

ససపాసలచే దశవి•శ్రమయుక్తతచేఁ, బొసఁగ న్నలినిన్ మణికం•బు సుదర్శనహ
స్తసరోరుహు వామనుఁ గే•శవుశౌరినజున్, వసుదేవనృపాలతనూ•భవుఁ బాడుదురా.

## అలసగతి ౧౫-౭౬౪౮

I I I న I I U స I I I న U I I భ I UU య.

అలసగతి నాఁ జను స•భాంతరమునందు, న్విలసదవతారయతి • నిండి నసనభ్యల్
గలయ శకటాసురవి•ఘాతను విశిష్టున్, బలుమఱుఁగవీశ్వరులుః•ప్రార్థనలు సేయన్.

## మణిగణనికరము ౧౫-౧౬౩౮౪

I I I న I I I న I I I న I I I న I I U స.

మణిగణనికరము•మను లఘుగురు వై, మణివిరమణ మయి • మధుదనుజహరున్
ఫణిపతిశయనునిఁ • బ్రమథితనరకు, న్ఘృణిమదయుతనిభు•ని బొగడఁ దనరున్.

వ. షోడశచ్ఛందం బగు అష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునాఱేసియక్షరంబు లై
౬౫౫౩౬ వృత్తములు పుట్టె నందు:—

## ప్రియకాంత ౧౬-౧౩౨౬౪

I I I న I UU య I I I న I UU య I I U స U గ.

అమరులు భృత్యు లనయ వి • యద్గంగ ధరిత్రీ
కమలలు [1]పెండ్లాములు రవి • కంజారులు గన్నుల్
శమితతృణావర్తున కని • చాటుం బ్రియకాంతా
ఖ్యము శివసంఖ్యావిరమణ • మై న్యన్యసగం బై.

## పంచచామరము ౧౬-౨౧౮౪౬

I U I జ U I U ర I U I జ U I U ర I U I జ U గ.

జరప్రజంబులున్ గముం బొ•సంగి తొమ్మిదింటిపై
విరామ మొంది సత్కవు ల్స•విస్తరంబు సేయఁగాఁ

---

1 పెంళాములు.

బరాత్పరుండు మాధవుండు ♦ పంచచామరంబునన్
బ్రరూఢగుంభనంబులందుఁ ♦ బాడ నొప్పు ధాత్రిలోన్.

పద్మకము ౧౬-౨౩౪౧౬

I I I న U I I భ I U I జ I U I జ I U I జ U గ.

నభజజాగగణయుక్తిఁ బి♦నాకివిరామక
ప్రభవమై కృతుల నొప్పును ♦ బద్మక మందమై
ప్రభుఁడు నక్రమును ద్రుంచి సు♦రక్షితుఁ జేయ సా
మభవపద్మకముచాడ్పున ♦ మానితమై ధరన్.

చంద్రశ్రీ ౧౬-౧౦౧౭౮

I U U య U U U మ I I I న I I U స U I U ర U గ.

క్షమం జంద్రశ్రీతోయమనసర♦గల్భానువిశ్రా
మముల్ సంబంధించు న్నరహరి ర♦మాచిత్తచోరా
శమీయామ్యాగారా శమనసహ♦జానాథకృష్ణా
ప్రమత్తక్రవ్యాదక్షణదళన ♦ రాధాభుజంగా.

మేదిని (వాణి) ౧౬-౧౧౧౮౪

I I I న I U I జ U I I భ I U I జ U I U ర U గ.

మృదయతి నజ్భజర్గములు ♦ మేదినీసమాఖ్యన్
దడబడుచుండఁగాఁ దనరు ♦ దంష్ట్రి పద్మనాభా
జడనిధితల్ప నందసుత ♦ సాళ్వరాట్కృతాంతా
కడు హితభక్తి నీకు నతి ♦ గావు మయ్య దేవా.

ఫలసదనము ౧౬-౧౬౩౮౪

I I I న I I I న I I I న I I I న I I U స U గ.

నననననసగములు ద♦నరఁగ దశవిశ్రాం
తిని ఫలసదనము ల♦తిశయ మగుచొప్పున్
మునిజనహృదయములఁ ♦ బొలుచువానిన్ (?)
గొనబుగ ముదమొదవఁ ♦ గొలిచెద మటంచున్.

అశ్వగతి ౧౬-౨౮౦౮౭

U I I భ U I I భ U I I భ U I I భ U I I భ U గ.

అందము లై నభకారము ♦ లైదును గాంతము లై
పొందిన పదింట విరామముఁ ♦ బూనిన యశ్వగతిం

గండసమానమహోన్నత•గాత్రుని శౌరిని గో
విందునిఁ బ్రస్తుతి సేయఁగ • వేడుక యయ్యెఁ జుమీ.

మదనదర్పణము ౧౬-౨౧౮౫౫

U I I భ I I U స I U I జ U I U ర I U I జ U గ.

చారుమదనదర్పణంబు భ•సరజజము లగుర్
మారవిమతవిశ్రమంబున • న్మహిం జెలంగు నా
భీరుల యమునాతటంబునం • బ్రియంబుఁ జేసి యా
భీరవరుఁడు గూడె నంచు భ•క్తి సన్నుతింపఁగా.

గజవిలసితము ౧౬-౩౨౭౨౭

U I I భ U I U ర I I I న I I I న I I I న I I I న U గ.

బాలసరోజనాభ • వరద తనుమిళితజం, బాల దిగంబరా స•మసృణకబళకర లం
బాలక మంగళావ•హా గజవిలసితమున,న్లా)లు భరేఫనాన•నగము లిభవిరమ మై.

XVII వ. సప్తదశచ్ఛందం బగుఅత్యష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదియేడేసియక్షరంబు
లై ౧౩౧౦౭౨ వృత్తంబులు పుట్టె నందు:—

శిఖరిణి ౧౭-౫౯౩౩౦

I U U య U U U మ I I I న I I U స U I I భ I U వగణము.

భజింతు న్నిత్యంబు న్మనిజనసదా•ప్రార్థనపరుఁ
గజేంద్రార్తిధ్వంసిం గృతకలలనా•గ్రావు నజరుఁ
ద్విజశ్రేష్ఠుల్ మెచ్చ న్యమనస భవల్ • విశ్వవిరతి
ప్రజాతాహ్లాదం బై శిఖరిణి యనా • భాసుర మగున్.

పృథ్వి ౧౭-౩౮౭౫౦

I U I జ I I U స I U I జ I I U స I U U య I U వగణము.

జసల్ జసయవంబు లుష్ణకర•సంఖ్యవిశ్రాంతులుఁ
బొసంగి కవిపుంగవుల్ పలుక • భూమిలోఁ బృథ్వి నా
నసంశయ మగుం గళిందతన•యామనోవల్లభా
ప్రసన్నవదనాంబుజా ధృత•పరశ్వధా మాధవా.

హరిణి ౧౭-౪౬౧౧౨

I I I న I I U స U U U మ U I U ర I I U స I U వగణము.

హరిణి యనువృత్తం బొప్పు న్బాస్కర•రాత్తవిరామ మై
సరి నసమరేఫస్వం బై షోడ•శప్రమదాసహా

స్ఫురమణుఁ దృణావర్తక్రవ్యాద♦సంహరు మస్తకో
పరిరుచిరపింఛాచూడుం బీత♦వస్త్రు నుతింపఁగా.

నర్కుటము (కోకిలకాకము) ౧౭-౫౬౨౪౦

। । । న । ∪ । జ ∪ । । భ । ∪ । జ । ∪ । జ । ∪ వగణము.

కొలిచెద నాదిదేవుపద♦కోకనదంబులు నేఁ
దొలఁచెదఁ దొంటిబామునఁ గు♦దుర్పడుపాపములం
దలఁచెద నామధేయ మతి♦తత్పరత న్జభజా
వలఁ దగునర్కుటంబునకు ♦ భర్గవిరామములన్.

మందాక్రాంత ౧౭-౧౮౯౨౪

∪ ∪ ∪ మ ∪ । । భ । । । న ∪ ∪ । త ∪ ∪ । త ∪ ∪ గగము.

మందాక్రాంత న్గిరిశవిరతు ♦ ల్మభ్నతాగాగణంబుల్
పొందె న్నాందీపునివలన సం♦పూర్ణవిద్యాచయంబుల్
క్రందించె న్దారుణరణమునం ♦ జాంద్రసాళ్వాదులం జే
యందెం జేరెం డడుకులకు నం♦దాత్మజుం డంచుఁ జెప్పన్.

పాలాశదలము (త్వరితగతి) ౧౭-౩౨౭౬౮

। । । న । । । న । । । న । । । న । । । న ∪ ∪ గగము.

అదనదసున హరినుతు ♦ లమర ధరఁ బాలా
శదళ మనఁ దనరుఁ గవి♦జనులు వచియింపన్
బదునొకఁ డగునెడ యతి ♦ పదిలమునఁ జేరన్
గదియుం నగణములయిదు ♦ గగము తుద నొందన్.

వంశపత్రపతితము ౧౭-౬౪౯౮౩

∪ । । భ ∪ । ∪ ర । । । న ∪ । । భ । । । న । ∪ వగ.

బాగుగఁ జెప్ప నొప్పు వసుధన్ ♦ భరనభనలగల్
సాగి పినాకివిశ్రమమమున్ ♦ సభలనుఁ గుదురై
రాగిలువంశపత్రపతిత ♦ ల్రణమున నరకు
ప్రాగతనంబునం దునిమె నం♦దతనయుఁ డనినన్.

చంపకకేసరి ౧౭-౪౬౭౨౭

। । ∪ స । ∪ । జ । । ∪ స । । ∪ స । । ∪ స । ∪వగ.

సనకాదియోగినుతు • జాంబవతీప్రియుం నిర్వికల్ప

ల్ప నమేయు నక్షరు వి•భు న్యమళార్జునభంజనున్

వనమాలిఁ గృష్ణు ముర•భంజను నెంతురు వారిజా

సనవిశ్రమంబు సజ•సాస్యలు చంపకకేసరిన్.

XVIII వ. అష్టాదశచ్ఛందం బగుధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునెనిమిదియక్షరంబులై

౨౬౨౧౪౪ వృత్తములు పుట్టె నందు:—

మత్తకోకిల ౧౮-౯౩౦౧౯

∪ । ∪ ర । । ∪ స । ∪ । జ । ∪ । జ ∪ । । భ ∪ । ∪ ర.

అత్తమిల్లు మహేశవిశ్రమ • మార్యసమ్మతి నొప్పఁగా

సత్తు లా రసజాభరేఫలు • చొకళింపుచు నొందఁగా

మత్తకోకిలవృత్తపద్ధతి • మక్కువం బొనరింపఁగా

హత్తి పూజ యొనర్ప వచ్చు జ•నార్దనాహ్వయు నెప్పుడున్.

కుసుమితలతావేల్లిత ౧౮-౩౭౮౫౭

∪ ∪ ∪ మ ∪ ∪ । త । । । న । ∪ ∪ య । ∪ ∪ య । ∪ ∪ య

వేమా ఱెన్నంగాఁ గుసుమితలతా•వేల్లిత న్మత్నయాయల్

శ్రీమార్తండశ్రాంతియుఁ గుదిరినం • జెన్ను మీఱు న్ధరిత్రిన్

గామేపల్లీశుం గనకవసనుం • గంజనేత్రున్ శుభాంగున్

గోమద్బాలుం గాలయవనహరుం • గుంజరేంద్రార్తినాశున్.

నిశి ౧౮-౭౪౯౪౪

। । । న । । । న ∪ । ∪ ర ∪ । ∪ ర ∪ । ∪ ర ∪ । ∪ ర.

ప్రబలు నిశను నార•రారంబుల న్రత్నవిశ్రాంతియున్

గబళితదవపావ•కాపూతనాజీవితాహారి కృ

ష్ణ బలసహజ పారి•జాతాపహారా యదుశ్రేష్ఠ దే

వబలదమనవంద్య • బంహిష్ఠ వార్ష్ణేయ శైనేయకా.

హారనర్తనము ౧౮-౯౦౯౭౧

∪ । ∪ ర । । ∪ స । ∪ । జ । ∪∪ య ∪ । । భ ∪ । ∪ ర.

దావపావకఖాది మా•ధవ దాశార్హా•దనుజాంతకా

దేవకీసుతనంద నా•దివిషదింద్రా•భువసన్ను తా

భావగోచర విశ్వరూ♦ప దగు స్వాత్మ♦వ్య నవర్తుసం
ఖ్యావిరామము రేఫస♦జ్యభరేఫంబుల్ ♦ హారన ర్తనన్.

### క్ష్మాహారము ౧౮-౩౦౮౪౧

U U U మ I I I న I U U య U U I త I I I న U U U మ.

బాహాబాహిని దమలో ♦ భ్రాతల్ దొడ్డ♦పగలఁ బోరాడం
గా హంవీరుఁ డగుబుధు♦క్షాసూనుఁ జ♦గతిని గూలంగా
నాహో యేసిననరపా♦లా రత్నేషు♦యతులు పొందంగా
క్ష్మాహారంబు మనయత♦న్మంబుల్ చెంది ♦ [1]మనును నందం బై.

ప. ఏకోనవింశతిచ్ఛందం బగునతిధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బందొమ్మిదేసి యక్ష
రంబు లై ౫౨౪౨౮౮ వృత్తములు పుట్టె నందు:—

### శార్దూలవిక్రీడిత ౧౯-౧౪౯౩౩౨

U U U మ I I U స I U I జ I I U స U U I త U U I త U గము.

నీరేజాంచితలోచనాయ హరయే ♦ నీలాంబుదాంగాయ మా
యారాత్రించరఖండనాయ విభవే ♦ హర్యక్షవక్త్రాయ తా
ర్క్ష్యారూఢాయ యటంచుఁ గూర్తురు నిరీ♦హా విశ్వవిశ్రాంతి వి
స్తారింప న్మసజ స్తతంబులు గము ♦ న్శార్దూలవిక్రీడితన్.

### తరళ ౧౯-౧౭౬౦౪౦

I I I న U I I భ U I U ర I I U స I U I జ I U I జ U గము.

జలజలోచనుఁ గైటభాంతకు ♦ శంఖచక్రగదాధరున్
గలశజాదిమునీంద్రసేవితుఁ ♦ గాళియాంతకు నచ్యుతున్
బలుకుచోఁ దరళంబు లందుల ♦ భానువిశ్రమపద్ధతిన్
గలియ నభ్రసజాగముల్ సమ♦కట్టి చెప్పుదు రుత్తముల్.

### మేఘవిస్ఫూర్జితము ౧౯-౨౫౨౧౪

I U U య U U U మ I I I న I I U స U I U ర U I U ర U గ.

క్షమాలక్ష్మీనాథున్ విదురవరదున్ ♦ జాహ్నవీజాతపాదున్
సమామ్నాయ స్తవ్యున్ గరుడతురగున్ ♦ సామజప్రాణదాతన్
మిముం దాఁ జేరొక్కన్న నృభలఁ దనరు ♦ న్మేఘవిస్ఫూర్జితంబుల్
విమర్శం గూర్పన్ యమ్న సరరగము ♦ ల్విశ్వవిశ్రాంతిచేతన్.

---

1 కనలు.

### చంద్రకళ ౧౯-౧౮౬౫౪౭

∪ I ∪ ర I I ∪ స I I ∪ స ∪ ∪ I త I ∪ I జ I ∪ I జ ∪ గ.

తానకంబుగఁ జంద్రకళావృ♦త్తంబు కవు ల్విరచించినన్
వీనులార మనోజ్ఞపదంబుల్ ♦ పేర్చి కపర్దివిరామ మై
కాన వచ్చి రసస్తజజంబుల్ ♦ గంబు దనర్చి కళిందజా
మానినీరమణస్తవగాథా ♦ మానితరత్నములం దగున్.

### భూతిలకము ౧౯-౧౮౬౦౩౯

∪ I I భ ∪ I I భ ∪ I ∪ ర I I ∪ స I ∪ I జ I ∪ I జ ∪ గము.

భారసజాగగణంబులుం బఱ♦వంగ భానువిరామవి
స్ఫారత భూతిలకంబు పాండవ♦పక్ష దైవతవృష్ణి మిం
పార ధరిత్రికిఁ దెచ్చినట్టిమ♦హాత్మ యంచుఁ గవీశ్వరుల్
చారుపదంబులు గూర్చి చెప్పిన ♦ శ్రావ్య మా వినువారికిన్.

### కవికంఠభూషణము. ౧౯-౧౩౭౯౦౦

I I ∪ స I ∪ I జ I I ∪ స I I ∪ స I I ∪ స I ∪ I జ ∪ గ.

నవరత్నవిశ్రమము♦నన్ సజసాసజగంబులన్ గవుల్
గవికంఠభూషణము♦గా రచియింతురు మాటిమాటికి
న్రవణిల్లుకబ్బమున ♦ నందకపాణి నుపేంద్రు రుక్మిణీ
ధవు సత్కథాసుధలఁ ♦ దత్పరు లై[1]న మహాత్ము లట్లుగాన్.

వ. వింశతిచ్ఛందం బగుకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదేసియక్షరంబు ౧౦౪౮౫౭౬ వృత్తములు పుట్టె నందు:—

### మత్తేభవిక్రీడిత ౨౦-౨౯౮౬౭౬

I I ∪ స ∪ I I భ ∪ I ∪ ర I I I న ∪ ∪ ∪ మ I ∪ ∪ య I ∪ వ గణః

మనువిశ్రాంతిని సభ్రనమ్యవములన్ ♦ మత్తేభవిక్రీడితా
హ్వాను వృత్తంబు చెలంగె మానవతులా♦రా వీఁడె యే తెంచె భ
క్తిని గాత్యాయనిఁ గొల్చునాఁడు యమునా♦తీరంబునం బొంది వే
డ్కను మాచీరలు దోఁచుకొన్న వెడదొం♦గం జూచినారా యనన్.

1 తనరారునట్లుగాన్.

### ఉత్పలమాల ౨౦-౩౫౫౭౯౯

U I I భ U I U ర I I I న U I I భ U I I భ U I U ర I U వగణము.

పేరిన నేయిదుగ్ధములు ♦ పెర్గును మీఁగడయుం న్సదా వ్రజా
గారము సొచ్చి త్రాగి వెస♦గంతులు వైచుమురారి నెంచఁ గా
ధారుణి రూఢి కెక్కు నవ♦తారవిరామము చే లసద్భరగ్
భారలగంబులుం గలయఁ♦బల్కిన నుత్పలమాల చెన్నగున్.

### అంబురుహము ౨౦-౩౭౨౧౫౧

U I I భ U I I భ U I I భ U I I భ U I U ర I I U స I U వగము

చారుతమాలదళాసితవర్ణునిఁ ♦ జక్రహస్తుసనాతను
న్దారితకంసముఖక్షితిపాలకు ♦ నందనందను నవ్యయుఙ్
శూరకులోద్భవుఁ గైటభభేదిని ♦ జోలి చేసి నుతింప భా
భారసవంబులు విశ్వవిరామముఁ ♦ బల్కు నంబురుహం బగున్.

### ఖచరప్లుతము ౨౦-౩౭౩౧౭౬

I I I న U I I భ U I I భ U U U మ I I U స I I U స I U వగ.

యమునలోఁ జొర నోడిననానా ♦ ప్రాకృతజంతువులం బ్రమో
దమునఁ బ్రోచుట కై కలఁచంగా ♦ దర్పమునం జనుదెంచి ఘో
రముగఁ జుట్టినకాళియుఁ సంహా♦రం బొనరించినకృష్ణ య
*ర్యమవిరామముతోడ నభామ్సస్వల్ ♦ రాజిలనౌ ఖచరప్లుతన్.

### ప్రభాకలిత ౨౦-౩౭౨౦౭౯

I I I న I U I జ I U I జ U I I భ U I U ర I I U స I U వగము.

వళి పదమూఁడవయక్కరంబుగ♦వాసి కెక్కు నజాభరే
ఫలు సలగంబు లమర్చి సొం పొద♦వం బ్రభాకలితాఖ్య మై
చెలు వగువృత్తమునందు సత్కవి♦శేఖరు ల్వినుతింతు రా
జలనిధిమీఁదను బవ్వళించిన♦జాంబవత్యధిపాలునిన్.

XXI వ. ఏకవింశతిచ్ఛందంబగు ప్రకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియొక్క యక్షరంబులై ౨౦౯౭౧౫౨ వృత్తంబులు పుట్టె నందు:—

---

* ర్యమవిరామముతోడ నభామ్స♦స్వల్వెలయుఙ్ (పూ. ము.) ఇందు యతి తప్పినది ; ర్యమవిరామముతోడ నభామ్సస్వల్ ♦ రాజిలనౌ (ప. ఓ. పె.)ఇందు గణము తప్పినది.

చంపకమాల ౨౧-౭౧౧౬౦౦

I I I న I U I జ U I I భ I U I జ I U I జ I U I జ U I U ర.

చపలమనీషతోడ నొక ♦ సంయమి వే మొఱ వెట్టుచుండఁగాఁ
గృపను దదీయపుత్త్రుఁ బ్రతి♦కించినమేటివిభుండ వంచు నిన్
సపరిగణంబుతో నజభ♦జాజలు రేఫయుఁ గూర్చి సత్కవుల్
త్రిపురవిభేదనాఖ్యవిర♦తిం దగఁ జంపకమాలఁ గొల్తు రా.

వనమంజరి ౨౧-౭౮౮౩౦౮

I I I న I U I జ I U I జ I U I జ I U I జ U I I భ U I U ర.

మనువిరతు ల్నజజాజభర ల్వన♦మంజరిం గవిశేఖరుల్
దనరఁగ నాజయుఁడు న్విజయుం డను ♦ ద్వారపాలకు లిర్వురు
న్సనకునిశాపము దాఁకి నిశాటు ల♦నంగఁ బుట్టి సుపర్వులన్
జెనకినవాండ్రను జంపినకోలనృ♦సింహుని న్వినుతింతు రా.

*స్రగ్ధర ౨౧-౩౦౨౯౯౩

U U U మ U I U ర U I I భ I I I న I U U య I U U య I U U య.

మానొందున్ స్రగ్ధరాఖ్యన్ ♦ మరభనయయయల్ ♦ మత్తనాగాష్టవిశ్రా
మానూనప్రాప్తులైనన్ ♦ హరిముఖదివిజుల్ ♦ యాతుధానవ్రజంబుల్
సానందాసక్తితోఁ దో♦యధికడ నమృతం ♦ బారగింపంగ నచ్చో
మానిన్యాకారతన్ స♦మ్మదమువొదలుఁ బ♦ద్మాధవానందపుత్త్రా!

లాటీవిటము ౨౧-౩౯౮౯౭౨

I I U స I I U స I I U స I I U స U U U మ U U I త I U U య.

సగణంబులు నాల్గిట మత్యలవి♦శ్వవిశ్రాంతి న్లాటీవిటవృత్తం
బగు నంచుఁ గవీంద్రులు గొల్తురు స♦మ్యక్ప్రీతి న్యాచించి యథేచ్ఛం
దగ నేర్పున మూఁడు పదంబులుగాఁ ♦ త్రైలోక్యంబు [1]ల్గొల్చి సురారుల్
వొగలం బలిదానవుఁ ద్రొక్కినయా♦పొట్టిం దిట్ట న్వామనుఁ గృష్ణున్.

మణిమాల ౨౧-౯౬౫౩౫౬

I I U స I U I జ I I U స I U I జ I I U స I U I జ I I U స.

అజహాత్పయోదధిఘృతంబు ♦ లమ్ముచు మురారిఁ బాడి రెలమిన్
వజుఁగాఁ దదీయచరణా త్త♦నవ్యహృదయారవింద లగుచు

* ఇది (పూ.ము)ల లో లేదు. (ప) లో ఉన్నది. 1 (పూ. ము.)లలో-గొల్చి గోరారుల్.

వ్ర్రజసుందరీజనము లొక్క ♦ నాఁడు మణిమాలయందుఁ బొసఁగ
స్రజము త్రివారము సముం బి ♦ నాకివిరమంబు పొందు దనరన్.

### కరిబృంహితము ౨౧-౭౮౨౨౭౧

U | | భ | | | న U | | భ | | | న U | | భ | | | న U | U ర.

మూఁడు భనములు రేఫమును బదు ♦ మూఁట విరతియుం సొంపుగాఁ
గూడుకొనఁ గరిబృంహితము సమ ♦ కూర్చి వసుమతి మండలా
పీడ మనుకరిబృంహితరవము ♦ వెల్లుగఁ బలుకుచుండఁగాఁ
గోడిగపు[1] చిననాఁడు శకటునిఁ ♦ గూల్చినహరి నుతించెదన్.

### కనకలత ౨౧-౧౦౪౮౫౭౬

| | | న | | | న | | | న | | | న | | | న | | | న | | U స.

జవమున భగభగ యనుచు వ్ర ♦ జజనములఁ బొదవినం
దవశిఖి నుడిపినమధుమర ♦ నరకదమన యని పే
లవముగఁ బలుమఱు నిరువది ♦ లఘువులు గము పదుమూఁ
డవయెడ విరతిఁ బొసఁగిన బె ♦ డఁ గడరుఁ గనకలతన్.

వ. ద్వావింశచ్ఛందం బగునాకృతియందుఁ బ్రతిపాదంబున కిరువదిరెండేసి యక్షరం
బులై ౪౧౯౪౩౦౪ వృత్తములు పుట్టె నందు:—

### మహాస్రగ్ధర ౨౨-౬౦౫౯౮౮

| | U స U U | త U U | త | | | న | | U స U | U ర U | U ర U గ.

స్తతనస్రాగ ల్విరించా ♦ ష్టవిరతులు మహా ♦ స్రగ్ధరం జెప్ప నొప్పున్
గ్రతువిఘ్నం బావహిల్లం బ్రమదమున వ్రజ ♦ వ్రాతదత్తాన్న మెల్లన్
క్షితిభృద్రూపంబున న్మై ♦ క్కొన రుష నమరా ♦ గ్రేసరుం డంప మ్రబ్బుల్
ధృతిమై. బాల్పొనఁ [2]గూల్పన్ ♦ దివిరి కరుణతో ♦ [3]ధేనువృద్ధ్యద్రి మోఁచెన్.

### భద్రకము ౨౨-౧౯౩౦౭౧౧

U | | భ U | U ర | | | న U | U ర | | | న U | U ర | | | న U గ.

భంబు రనత్రయంబు గము నొంది ♦ భానుయతి భద్రకంబు దనరున్
బంబినపిల్లగోల కరయుఁగ్మ ♦ పాదములఁ బట్టి యూఁది పశువ
ర్గంబు నరణ్యమధ్యమధరిత్రిఁ ♦ గాచుసమయంబున న్యమున తీ
రంబున గొల్లలం గలసి యోగి ♦ రంబు దినెఁ గృష్ణుఁ డంచుఁ బలుకన్.

---

1 చిననాఁడుటకునల. (పె). 2 గూల్పన్ (ఓ); గూల్చన్ (ప) గుర్వన్ (పూ. ము). 3 ధేనువర్ధాద్రి (పూ.ము).

మానిని ౨౨-౧౭౯౭౫౫౯

∪ I I భ ∪ I I భ ∪ I I భ ∪ I I భ ∪ I I భ ∪ I I భ ∪ I I భ ∪ గ.

రాజిలు సప్తభము ల్గము విశ్వవి♦రామము మానినియందు భర.
ద్వాజముఖప్రమునీశ్వరు లందఱు ♦ దైత్యగురుం భృగువాక్యమునన్
రా జలనాయకతల్పుని దైవత♦రాజు నజస్రము గొల్తురు వి
భ్రాజితమోక్షము చేకుఱఁ బుణ్యధ♦రాస్థలి నంచు వచించుటచేన్.

విచికిలిత ౨౨-౨౦౯౭౧౫౨

I I I న I I I న I I I న I I I న I I I న I I I న I I I న ∪ గ.

ప్రవిలయసమయమునను బద♦పడి జలనిధినడుమ స
ద్భువనములు కడుపున నిడుక ♦ భుజగపతిశయనముపై
నవిరళమతిఁ గురుకువరదుఁ ♦ డని విచికిలితఁ బదుమూఁ
డవయెడ వడి యిరువదియొక♦లఘువు గము బలుక నగున్.

తురగము ౨౨-౧౪౯౦౯౪౪

I I I న I I I న I I I న I I I న I I ∪ స I ∪ I జ I ∪ I జ ∪ గ.

నననననసజజగలు తిథివిరమ♦ణం బగు స్తురగంబునన్
గనలుచు నగరముపయి విడిసిన ♦ గాంచి తా నొకరుం డెదు
రొక్కని దవులకుఁ గొని చని గిరిగుహఁ ♦ గూర్కునాముచికుందుచే
తను యవనునిఁ బొరిగొని తని వసు♦ధ న్గణింతురు భూసురుల్.

[1]మద్రకము ౨౨-౧౯౪౭౦౯౫

∪ I I భ ∪ I ∪ ర I I I న ∪ I ∪ ర I I ∪ స I I ∪ స I I I న ∪ గ.

అధ్వమునందు నడ్డమయి వా♦హనాకృతి నున్నబకాసురు మహా
సాధ్వసదు న్వ్రజార్భకవినా♦శనక్షము వక్త్రముఁ జొచ్చి సురలున్
బ్రాధ్వగు లైనుతింపఁగఁ దదీ♦యదేహము వెళ్లినఁ గృష్ణునుతి న
క్రధ్వజమద్విరామము భర♦న్రసానగలుం దగుమద్రకమునన్.

XXIII వ. త్రయోవింశతిచ్ఛందం బగు వికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదిమూఁ
యక్షరంబు లై ౮౩౮౮౬౦౮ వృత్తంబులు పుట్టె నందు:—

1 ఇది (ప) లో మహాస్రగ్ధర తర్వాత ఉన్నది.

కవిరాజవిరాజితము ౨౩-౩౫౯౫౧౨౦

| | | న | U | జ | U | జ | U | జ | U | జ | U | జ | U | జ | U వగణము.

కలయఁగ నొక్క న♦కారము నాఱుజ♦కారములు న్వము ♦ గాటముగా
నలరినచో ద్విర♦దాచలశైలము ♦ లై త్రివిరామము ♦ లంది నిర
ర్గళకవిరాజవి♦రాజితవృత్తము ♦ రాణ జనార్దన రమ్యకథా
వళులఁ గవీశులు ♦ వర్ణన సేయఁగ ♦ వ్రాలు నజస్రము ♦ వావిరిగన్.

అశ్వలలిత ౨౩-౩౮౬౧౪౨౪

| | | న | U | జ U | | భ | U | జ U | | భ | U | జ U | | భ | U వగ.

సలలితవిశ్వవిశ్రమము నజ్భ♦జ ల్భజభవంబు లశ్వలలితన్
జెలువుగఁ గూర్చి సత్కవులు తల్లి ♦ చిన్నిసమయంబునందున నులూ
ఖలమునఁ గట్టి వైచినను నీడ్చు ♦ [1]క ద్దరలి మద్దిచెట్లు ధరణిం
గలపినకృష్ణుఁ గీర్తనము సేయఁ ♦ గాఁ దనరు సర్వకాలము ధరన్.

పద్మనాభము ౨౩-౧౪౯౭౯౭

U U | త U U | త U U | త U U | త U U | త U U | త U U గగము.

వేమాఱు నప్పద్మనాభంబున న్విశ్వ♦విశ్రాంతియుం న్సప్తతంబు ల్గగంబున్
గోమాఱుగా దేవరాత్రించరుల్ క్షీర♦కూపారమధ్యంబున న్వీఁపుమీఁదన్
బ్రామంగ మంథాచలం బోపికం గచ్ఛ♦పస్వామి యై మోచె నీకృష్ణుఁ డంచున్
గామించి విద్వాంసు లెల్ల న్వచింపంగఁ ♦ గ్రాలు న్ధరిత్రి న్సదా మానితం బై.

మత్తాక్రీడ ౨౩-౪౧౯౪౦౮౧

U U U మ U U U మ U U | త | | | న | | | న | | | న | | | న | U వగ.

మత్తాక్రీడాఖ్యం బెం పారు ♦ న్మమతననవ ♦ మహిత మగుచు ర
త్నాత్తబ్రహ్మాశ్రాంతు ల్గాం బై ♦ యమరగ రణమున ♦ నధికబలు మదో
న్మత్తుం జాణూరక్రవ్యాదు ♦ న్మధురవడుమఁ బెడ ♦ మరలి పిడికిటన్
సత్త్వామాత్రుం డుర్విం గూల్చె ♦ న్సకలదివిషదులు ♦ సమతను బొగడన్.

వ. చతుర్వింశతిచ్ఛందం బగుసంకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదినాలుగేసియక్షరంబు లై ౧౬౭౭౭౨౧౬ వృత్తంబులు పుట్టె నందు:—

1 (ప) లో పాఠము ఇందులకు భిన్నముగానున్నది కాని దానిపై గీతలు గీచి యుండుటచే స్పష్టముగాలేదు. మఱికొన్ని తాటాకుపుస్తకములు చూడవలెను.

సరసిజము ౨౪-౮౩౮౮౧౯౩

∪∪∪మ ∪∪।త ।∪∪య ।।।న ।।।న ।।।న ।।।న ।।∪స.

సంబంధించు న్మత్యలు నానా♦సలు దళనిధియతి ♦ సరసిజమునకున్
గంబూర న్బృందాటవిలోనం ♦ [1]గవిసికొనినసుర♦కరువలిదనుజున్
శంబాభీలం బై తగుముష్టిం ♦ జవివినయదుపతి♦ స్తవములు ననురా
గం బూర న్నోక్భిల్లఁగఁ బ్రాంచ♦త్కవివరు లభినుతిఁ ♦ గఱపుదు రవనిన్.

క్రౌంచపదము ౨౪-౪౧౯౩౪౭౯

∪।।భ ∪∪∪మ ।।∪స ∪।।భ ।।।న ।।।న ।।।న ।∪∪య.

పంచమకేశుం డిచ్చినభాస్వ♦ద్వరమున మనమున ♦ బవరము గోరన్
వంచనతో బాణాసురుహస్త♦వ్రజములు దరిగెను ♦ వడి హరి యంచు
న్బ్రాంచితలీల న్శంకరనంది♦ప్రకటితవిరతులు ♦ భమసభనాన్యల్
క్రౌంచపదీవృత్తమ్మునఁ జెన్నా♦రఁగఁ బలుకుదు రిల ♦ గవివరు లెల్లన్.

తన్వి ౨౪-౪౧౫౫౩౬౭

∪।।భ ∪∪।త ।।।న ।।∪స ∪।।భ ∪।।భ ।।।న ।∪∪య.

దూడలతోఁ గాపరులను గుహలో ♦ దొంగిలిదాచినవిధి నదలింపన్
గూడుక తద్రూపము లయి పసులుం ♦ గోపవధూటులు మురిపము నొందన్
బాడి వినోదంబులు సలిపినగో♦పాలుఁ డటంచును భతనసభాన్యల్
దాడి గొన న్విశ్వవిరమణముతోఁ ♦ దన్విని జెప్పఁగఁ దనరుఁ గవీంద్రుల్.

అష్టమూర్తి ౨౪-౩౬౧౪౫౨౧

∪∪∪మ ।।।న ∪∪।త ।।∪స ∪।∪ర ∪।।భ ।∪।జ ।∪∪య.

శ్రీకృష్ణుం గనకవస్త్రుం ♦ జితతృణావర్తదైత్యు ♦ న్సితకుశేశయనాభున్
వైకుంఠు న్వరదు బృందా♦వనచరు న్వాసుదేవు ♦ న్వసుమయుం బరముం బ
ద్మాకాంతు న్నిధినిధానా♦మలవిరామంబు లొప్ప ♦ న్మనతసర్భజయంబుల్
సోకం జెప్పుదురు విద్వాం♦సు లిలలో నష్టమూర్తి♦న్సుప్రతిభు లకృతచర్యుల్.

వ. పంచవింశతిచ్ఛందం బగు నతికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియైదేసి యక్షరంబు లై ౩౩౫౫౪౪౩౨ వృత్తంబులు పుట్టె నందు:—

బంధురము ౨౫-౧౪౩౬౮౭౬౮

।।।న ।।।న ।।।న ।।।న ।।∪స ∪।।భ ∪।।భ ∪।।భ ∪గ.

సొరిది ననననసభభభగములతో ♦ షోడశసంఖ్యావిరామముతో
బరువడి దినదినమును బుధజను లీ♦బంధురవృత్తమునందు నుతిం

1 గవసు (ప).

తురు హిమకరకుసుమము నొసటను గ♦న్ను న్ఫణిపాగయుం దాల్చినయా
దొరజడలనడుమనిలిచిన తెలుపుం ♦ దూకొనువాఁగుకుఁ దండ్రి యనన్.

భాస్కరవిలసితము ౨౫-౪౩౪౧౩౧౧

U I I భ I I I న I U I జ I U U య U I I భ I I I న I I I న I I U స U గ.

చెల్లెలి విజయున కిచ్చినవానిం ♦ జేరెడుపృథుకములు దినినవానిన్
గొల్లతలను వలపించినవానిం ♦ గొల్లకుఁ గొడు కనఁ బరఁగినవానిన్
మల్లుర రణమునఁ జంపినవాని ♦ న్భజ్జయభననసగలు పదుమూఁటన్
బల్లిద మగువిరమంబు దలిర్ప ♦ న్భాస్కరవిలసితములఁ గొనియాడున్.

ధరణిధరగతి ౨౫-౧౬౭౭౭౨౧౬

I I I న I I I న I I I న I I I న I I I న I I I న I I I న I I I న U గ.

వసునములు గము ♦ వసువసుయతులు ♦ వల నగు ధరణిధరగతిన్.
గస రొదవి సుడి♦కరువలిపగిదిఁ ♦ గదసి యదుశిశుచయముతో
*మసలెదునెడ మురమథన నినుఁ గొని ♦ మదిని నలరుచు నెగసి యా
కసమున నెగయఁ♦గ శకటదనుజు♦షమఁ గలిపితి వని పలుకన్.

వ. షడ్వింశతిచ్ఛందం బగునుత్కృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదాఱేసి యక్షరంబు లై ౬౭౧౦౪౪౬౮ వృత్తంబులు పుట్టె నందు:—

భుజంగవిజృంభిత ౨౬-౨౩౪౫౮౪౯

U U U మ U U U మ U U I త I I I న I I I న I I I న U I U ర I I U స I U వ గ.

వ్రాలు న్రత్నేశానశ్రాంతు♦ల్వహి మమతననసరస♦వల్ భుజంగవిజృంభితన్
గాళిందీయోషం బెండ్లాడ ♦ న్ఖరదనుజుఁ దుసి మెను శి♦ఖావలాంచితపింఛమున్
మాళిం దాల్చె న్బండిం ద్రోచె ♦ న్మఱఁదికి రథముఁ గడపె♦[1]మద్దిచెట్లులు రెండు ని
ర్మూలించెద్దాలంబుల్గూల్చెన్ ♦ముగుదలు భ్రమయ మురళి♦మ్రోయఁ జేసెవిభుండనన్.

వరాహము ౨౬-౩౭౪౪౬౦౧

U U U మ I I I న I I I న I I I న I I I న I I I న I I I న I I U స U U గ గ.

రాజిల్లు న్దశకుధరవి♦రతులు మగణ♦రసనసగగలు వరాహాఖ్యన్
జేజే లందఱు పొగడ సు♦చితుఁ డని తలఁ♦చి భృగువు పలుకఁగ నిత్యంబున్
తేజశ్శ్రీ పెరుగఁగ మది♦[2]దృఢముగ నిడి♦తిమురుచుఁ గొలిచిరి దాశార్హున్
రాజీవాక్షుని నరహరి♦రవికులవరు♦రఘుపతి బలసహజున్ గృష్ణున్.

---

* ఇచ్చట గణభంగము. 1 మద్దిచెట్లులఁగూలిచెన్, దాలంబుల్గూల్చె న్వేగన్ ♦ ముగ్ధలు భ్రమయఁగను♦మురళిదాల్చెన్ సువిభుండనన్. (పూ ము). 2 ధృవముఁగ (ప).

### మంగళమహాశ్రీ ౨౬-౧౫౬౫౭౮౭౩౫

U I I భ I U I జ I I U స I I I న U I I భ I U I జ I I U స I I I న U U గ గ ము.

పొత్తు లెడఁబాయుటను♦బోరుసమయంబునను ♦ బొంగుచుఁ గురూద్వహుల నెల్లన్
దుత్తుమురు సేయఁగఁ గు♦దుర్చును మనీష నది♦దుష్టసమరావనిఁ గిరీటి
కృత్తకు భజస్నభజ♦సానగలు మన్యుజుల ♦ శ్రాంతులును మంగళమహాశ్రీ
వృత్తములఁ జెన్నలర ♦ నిచ్చిరి సువాసినులు ♦ నిం పడర మంగళమహార్తుల్.

క. పొందుగ నిరువదియా అగు, ఛందములం దుదయ మైన♦సమవృత్తము లా
నందమునఁ గవులు పొగడెదు, కందువల వచించినాఁడఁ ♦ గా మెపలీశా. 178

వ. ఇవి సమవృత్తలక్షణంబు లింక ముఖ్యగౌణవృత్తలక్షణంబు లెఱింగించెద. 179

### ముఖ్యగౌణవృత్తలక్షణము.

సీ. సమవృత్తపజ్క్తి-స్వ♦స్థానార్ధసమములు స్వస్థానవిషమాఖ్యఁ ♦ జనునవియును
బృథివిపై సమవృత్త♦భేదంబు లీమూఁటి కక్షరంబులు సమం ♦ బన్నికాళ్ల
నివి వృత్తముఖ్యంబు ♦ లిఁకఁ బరస్థానార్ధసమవృత్తములు పర♦స్థానవిషమ
సంజ్ఞలఁ బద్యము♦ల్పూర్వపరస్థానవిషమంబులును నివి ♦ విషమవృత్త

తే. భేదములు వీనినాలుగు♦పాదములను, సమముగాఁ జూపడవు వర్ణ♦సంఖ్య లెచ్చు
కడమ లై యుండు నీమూఁటి♦గౌణవృత్త, పద్యములటం డ్రు శ్రీకామె♦పల్లినిలయ

### సమవృత్తవివేకము.

గీ. జగతి సమవృత్త మెన్నవ♦ఛందమునను, సంభవము నొందె నన్ని య♦క్షరము లమర
బదపదంబున హెచ్చును♦గొదువ గాక, ప్రాసములు విరామంబులఁ ♦ బరిఢవింప. 18

### స్వస్థానార్ధసమవివేకము.

ఆ. అక్షరములు సమము♦లయ్యె స్వస్థానార్ధ, సమములందు నాల్గు♦చరణములను
విషమపదము లొక్క♦విధముగణంబులు, సమపదంబు లొక్క♦పరిగణములు. 1

క. సగ మొక్కవిధంబునఁ బేఱ, సగ మొక్క తెఱంగు గాఁగ ♦ సమకూర్పఁదగున్
జగతి నొకకా లొకకరణి, నొగి మూఁడుపదంబు లొక్క♦యోజం దనరున్. 1

తే. సాధుకవికృతగ్రంథసం♦జాత మెల్లఁ, వెదకి సకలోపజాతుల♦విచ్చలవిడిఁ
గాళిదాసుఁడు రఘువంశ♦కావ్యమునను, జెలఁగి రెండవసర్గలోఁ ♦ జెప్పినాఁడు. 1

వ. అటు గాన స్వస్థానార్ధసమవృత్తంబులం దుపజాతి యనువృత్తము.

### ఉపజాతివృత్తము.

ఈపాటితో జేసుల ♦ నింద్రవజ్రం, బుపేంద్రవజ్రాహ్వయ ♦ మున్విసర్గం
దాపించినంతం గరు♦ణాసముద్రా, జపిష్ఠలోలా యుపజాతి యయ్యెన్.

వ. ఇది పదునొకండవ త్రిష్టుప్ఛందంబునందలి యింద్రవజ్రాచ్ఛాయను బేసిపాదాలును నుపేంద్రవజ్రాఛాయను సరిపాదాలును నడుచును. [1]దీనిపేరే నిశి. 187

### మఱియు, వ్యత్యస్తోపజాతి

తలంబులై బేసి జ•తజ్జగంబుల్, చాలొప్పసర్గ్గందత•జల్గగంబుౝ
జలంబుతోనిట్లు • సాగినంతౝ, వాలారు వ్యత్యస్తము • వాసుదేవా ! 188

వ. ఇది ఉపేంద్రవజ్రచ్ఛాయను బేసిపాదములను, ఇంద్రవజ్రచ్ఛాయను సరిపాదములును నడుచును. మఱియు, 189

### సమోపజాతి.

తాపింఛనీలాంగుఁ బృ•దాకుతల్పుౝ, గోపాలబాలుం బ్రవి•కోటితేజుౝ
గృపాసముద్రు న్నుతి•యించెద స్మృత్త్యుపాధిఁ గాంక్షించి స•మోపజాతిన్. 190

వ. ఇంద్రవజ్రాఛాయను మొదలిరెండు పాదములను నుపేంద్రవజ్రాఛాయను గడమ రెండుపాదములను నడుచును. మఱియు, 191

### వ్యత్యస్తసమోపజాతి

తపంబుచేఁ గొల్తు వి•ధాతృతాతౝ, గపాలికోదండవి•ఖండనాఖ్యుౝ
గోపీభుజంగుౝ ధృత•గోత్రు సన్మో, క్షోపాయుం వ్యత్యస్త స•మోపజాతిన్. 192

వ. ఇది యుపేంద్రవజ్రాచ్ఛాయను మొదలిరెండు పాదములఁను నింద్రవజ్రాచ్ఛాయను గడమ రెండుపాదములను నడుచును. మఱియుం, 193

### వైపరీత్యోపజాతి.

తాజ ల్లగంబొంట జ•తజ్జగంబుల్, గజిక్కున మ్మూఁటను•గంతువేయుంౝ
వ్రజాంగనావల్లభ•వైపరీత్యో,పజాతివృత్తంబు స•భం జెలంగున్. 194

వ. ఇది యింద్రవజ్రాఛాయను మొదలిచరణమున నుపేంద్రవజ్రాఛాయను గడమ మూఁడుచరణములును నడుచును. దీనిపేరే[2]వాతాంగియుం, మఱియుఁ నీవృత్తమునఁనే యింద్రవజ్రాచ్ఛాయను ఏదైన నొకచరణమును నుపేంద్రవజ్రాచ్ఛాయను ఏవైన మూఁడుచరణములును జెప్పినను తప్పులేదు. మఱియును, 195

### ఉపచిత్ర.

ఛిదురంచిససావలు • బేసులౝ, గాదిలి భాభగ•గంబులు సర్లౝ
గుదు రై రసికస్తుతి•గూడినౝ, శ్రీదయితా యుప•చిత్ర చెలంగున్. 196

---

1 ఈవాక్యము పూ. ము. లలో లేదు.

2 వాగాంగిని (పూ. ము); వారాంగి ముందు వచ్చును. (చూ. ఆ. 4. 207).

వ. ఇది త్రిష్టుప్ఛందమునందలి వృత్తచ్ఛాయను బేసిపాదములను దోదకవృత్తచ్ఛాయను సరిపాదములను నడుచును. మఱియు, 197

నారీనుతము.

పేరెంబు ల్వారొరి॰బేసి న్మతాగా, సారంబు సర్లక్ దత॰జ ల్గగంబుల్
ధీరోదాత్తుల్ సన్ను॰తింపన్ ధరిత్రిన్, నారీనుతం బయ్యె జ॰నార్దనాఖ్యా. 198

వ. ఇది పదునొకొంటం ద్రిష్టుప్ఛందస్సునందలి శాలినీవృత్తచ్ఛాయను బేసిపాదములును నింద్రవజ్రాచ్ఛాయను సరిపాదములును నడుచును. మఱియు, 199

అజితప్రతాపము.

జలజాక్ష ! బేసుల స॰జల్ ససలున్, బలుమఱున్ సరి న॰భజ్ర లొందఁగా
జలజోద్భవాబ్జభవి॰శాలయతుల్, దళము లైన యజి॰తప్రతాపమా. 200

వ. ఇది పండ్రెండవ జగతీచ్ఛందస్సునందలి ప్రమితాక్షరవృత్తచ్ఛాయను సరిపాదములను బ్రియంవదావృత్తచ్ఛాయను బేసిపాదములను నడుచును. మఱియు, 201

రతిప్రియము.

బేసి న్మజ్సరగలు॰పేర్చి సర్ల జంబున్, భసజ్జగల్గదిసిన॰పాదబద్ధ మై
యోంసామోద్భవచతు॰రాస్యవిశ్రమఖ్యాతి సన్నుతింపఁదగు ర॰తిప్రియం బనన్. 20[illegible]

వ. ఇది పదుమూఁడవ అతిజగతీచ్ఛందస్సునందలి ప్రహర్షిణీవృత్తచ్ఛాయను బేసిపా[illegible] ములును రుచిరవృత్తచ్ఛాయను సరిపాదములును నడుచును. 20[illegible]

ఇది స్వస్థానార్ధ సమవృత్తలక్షణం బింక స్వస్థానవిషమవృత్తంబు లెట్టి వనిన:—

స్వస్థానవిషమవృత్తవివేకము.

ఆ. చరణములను వర్ణ॰సంజ్ఞలు దప్పక, నాల్గుపాదములగ॰ణములు నాల్గు
విధము లై చెలంగు॰వృత్తముల్ స్వస్థాన, విషమవృత్తసంఖ్య॰వెలయుచుండు. 2[illegible]

ధరణి.

రసపై సచతుష్కము ♦ రారసలున్, నాససల్ మాససల్ ♦ నాటిన న్మణితా
పసనగరస॰పరిపక్వయతు, ల్రా సోం పారు న్వా॰లాయముగా ధరణుల్. 2[illegible]

వ. ఇది జగతీచ్ఛందస్సునందలి తోటకవృత్తచ్ఛాయను మొదటిపాదమునను గడ[illegible] మూఁడుచరణములును గవికల్పితము లై నడుచును. మఱియు, 2[illegible]

వారాంగి.

తాజ ల్గయుఙ్మంబు జ॰తజ్గగంబుల్, తజాగగంబుల్ మభ॰తల్లగంబుల్
రాజిల్లు నిభేంద్రవి॰రామయుక్తిన్, వాజిగ్రీవా హరి॰వారాంగి దగున్. [illegible]

వ. ఇది యింద్రవజ్రాచ్ఛాయను మొదటిచరణమునను నుపేంద్రవజ్రాచ్ఛాయను రెండవచరణమునను గీతాలంబనవృత్తచ్ఛాయను మూఁడవచరణమునను వాతోర్మివృత్తచ్ఛాయను నాలవచరణమునను నడుచును. మఱియు, 208

### అంగజాస్త్రము.

రంగు భమస్గల్ ♦ గ్రాలు మసజ్గల్, పొంగై మన్యగ♦ము ల్రజర్గ లొ
ప్పంగా నార్త♦వగిరివ శైలై తే, నంగజాస్త్రవృత్త ♦ మందగించున్. 209

వ. ఇది రుగ్మవతీఛాయను మొదలిచరణమునను శుద్ధవిరాటిచ్ఛాయను రెండవచరణమునను పణవచ్ఛాయను మూఁడవచరణమునను మయూరసారిచ్ఛాయను నాల్గవచరణమునను నడుచును. మఱియు, 210

### నదీప్రఘోషము.

పోలిమై రారరం♦బుల్ జత్రజ్రంబులుం
తలంచఁగా యాయయలుం ♦ దత్రజ్రలుం
విలాసాచలాష్టేభ♦విశ్రాంతితోడం
దేలింప నొప్పారు న♦దీప్రఘోషముల్. 211

వ. స్రగ్విణీవృత్తచ్ఛాయను మొదలిచరణమునను వంశస్థచ్ఛాయను రెండవచరణమునను భుజంగప్రయాతవృత్తచ్ఛాయను మూఁడవచరణమునను ఇంద్రవంశచ్ఛాయను నాలవచరణమునను నడుచును. 212

ఇది స్వస్థానవిషమవృత్తవివేకం బింకఁ బరస్థానార్ధసమవృత్తవివేకం బెఱింగించెద:—

### పరస్థానార్ధసమవృత్తవివేకము.

క. మానుగ సమాంఘ్రు లొకగతిఁ, బూనిక విషమాంఘ్రు లొక్క♦పోలికలిపు లై
హీనాధిక్యములు పరస్థానార్ధసమంబులందు ♦ సమవిషమములన్. 213

### మనోహరవృత్తము.

పేరైనతజజ్వలం ♦ బేసియెడం, సరులం సచతుష్క♦ము ♦ సాగిన గం
భీరేభపితామహ♦విశ్రమముల్, పెరుగంగ మనోహర♦వృత్తము లా. 214

వ. ఇది కలితాంతవృత్తచ్ఛాయను బేసిచరణములును దోటకవృత్తచ్ఛాయను సరిచరణములును నడుచును. 215

### కేతుమతి.

జత బేసుల న్స♦జనగముల్, భాతి సరిం భరే♦ఫనగగంబుల్
యతిశైలసంఖ్య ♦ నమరఁగా, నాతత కేతుమ♦త్యభిధ మొప్పున్. 216

